# EARLY TELUGU INSCRIPTIONS

## (UPTO 1100 A.D.)

With

Texts, Glossary & Brief Linguistic History

Dr. Budaraju Radha Krishna




ANDHRA PRADESH SAHITYA AKADEMI

KALABHAVAN, SAIFABAD

HYDERABAD-4

# ప్రాచీనాంధ్ర శాసనాలు

( క్రీ. శ. 1100 వరకు )

పాఠ, పదకోశ, సంగ్రహభాషాచరిత్రలతో

డా. బూదరాజు రాధాకృష్ణ




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్
హైదరాబాద్ - 4

అంకితం

కీర్తిశేషులు

చరిత్ర పరిశోధక చక్రవర్తులు

మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి

# తొలిపలుకు

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి పక్షాన కొన్ని సంవత్సరాల క్రింద సుప్రసిద్ధ పరిశోధకులైన కీ. శే. కుందూరి ఈశ్వరదత్తుగారి శాసనపదకోశము ప్రకటించిన సంగతి అందరికి తెలిసినదే. ఈ సందర్భములో ప్రాచీన శాసనాలను కొన్నింటిని కాలక్రమములో యేరికూర్చి ప్రకటించవలెనని కొందరు విద్వాంసులు అభిప్రాయపడినారు. ఈ అభిప్రాయానికి అనుగుణంగా ప్రస్తుత శాసనాల సంపుటము ప్రకటించడము జరుగుతున్నది. ఇందులో క్రీ. శ. రెండు-పదకొండు శతాబ్దాల మధ్యన అనగా సుమారు తొమ్మిదినూర్ల సంవత్సరాల కాలములోని శాసనాలను మొత్తము రెండునూర్ల ఇరువది తొమ్మిదింటిని యేరికూర్చనైనది. ఇది పరిశోధకులకు ప్రయోజనకారి కాగలదని ఆశింపబడుతున్నది.

ఈ గ్రంధములో చేర్చిన శాసనాలలోని ముఖ్య పదాలకు అర్థవివరణతోపాటు పదప్రయోగ విశేషాలుకూడ యీయనైనది. ఇందులో చాల పదాలు యింతకు పూర్వము నిఘంటువులలో చేరనివిగా ఉన్నవని సంపాదకులు అభిప్రాయపడుతున్నారు. ఈ పద్ధతిలో శాసనాలను ప్రకటించడము తెలుగులో యిదే ప్రథమ పర్యాయము. ఇందులో చేర్చిన శాసనాలను తెలుఃగులిపిలోను, రోమను లిపిలోను అచ్చువేయడము జరిగినది. ఈ శాసనాలలో కొన్ని యిప్పటి వరకు ప్రకటితము కాలేదని సంపాదకుల అభిప్రాయము.

ఈ గ్రంథానికి సంపాదకులైన డా. బూదరాజు రాధాకృష్ణ గారు యీ మార్గములో విశేషపరిశ్రమ గావించిన ఉత్తమశ్రేణి విద్వాంసులు. తెలుగు శాసనాలపైన వారు రచించిన పరిశోధనా వ్యాసానికి ఆంధ్ర విశ్వవిద్యాలయము, వారికి డాక్టరేట్ పట్టము యిచ్చినది. ఈ ఉత్తమ సంపుటమును అకాడమి పక్షాన ప్రచురించే

అవకాశము కలిగించిన డా. బూదరాజు రాధాకృష్ణగారికి అకాడమి పక్షాన కృతజ్ఞతలు.

ఈ గ్రంథము చరిత్ర, భాషా రంగములలోనేగాక పురావస్తు రంగములోను పరిశోధన చేయు విద్వాంసులకు ఉపయోగపడగలదని ఆశింపబడుతున్నది. త్వరలోనే పదకొండు పదహారు శతాబ్దాలమధ్య లోని గద్యపద్య శాసనాల సంపుటముకూడ అకాడమి పక్షాన ప్రకటితము కాగలదని తెలుపుటకు సంతోషిస్తున్నాను.

12-11-1971

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# పీఠిక

రమారమి ఒక పుష్కరకాలం కింద ప్రాచీనాంధ్రభాషకు చారిత్రక వ్యాకరణం రచించాలనే సంకల్పంతో సేకరించిన శాసనాలను ఇంతకాలానికి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారి సహాయసహకారాలవల్ల ప్రచురించే అవకాశం కలిగింది. ఈ శాసనాలన్నీ ఒకచోట దొరికేవి కావు; ఒకరు ప్రచురించినవి కావు. ఇందులో కొన్ని ఇంతకుముందు ఎవరూ ప్రకటించనివి కూడా.

కేంద్ర ప్రభుత్వ లిపిశాస్త్ర విభాగంవారు ఏటేటా ప్రచురించే నివేదికలనుబట్టి చూస్తే అసంఖ్యాకమైన తెలుగు శాసనాలు ఇంకా అముద్రితంగానే ఉన్నాయని తెలుస్తుంది. తెలిసి విచారం కలుగుతుంది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు గట్టి చర్యలు తీసుకుంటేతప్ప అవి వెలుగుచూసే అవకాశం ఇప్పట్లో లేదు. అయితే చరిత్ర నిర్మాణానికి ఉపయోగపడే శాసనా లనేకం అచ్చయినాయి. భాషాచరిత్రమీద అభిమానాభినివేశాలున్న విద్వాంసులు కొందరు ప్రాచీనాంధ్రశాసనభాషను పరిశీలిస్తూ తమ చర్చలకు ఆధారమయిన శాసనపాఠాలను ప్రచురించారు. భిన్నవ్యక్తులు భిన్నపాఠభేదాలతో వాటిని ప్రకటించారు. కొందరు కొన్ని శాసనాలను కొన్ని పాఠభేదాలను మాత్రమే పరీక్షించారు. చిలుకూరి నారాయణరావుగారి 'ఆంధ్రభాషా చరిత్ర' కాలంనుంచి కోరాడ మహాదేవశాస్త్రిగారి 'Evolution of Telugu' వరకున్న ముద్రితగ్రంథాల్లో లభించే ప్రాచీనాంధ్ర శాసనాల సంఖ్య పరిమితం. వాటి కాలనిర్ణయం విషయంలో జరిగిన చర్చలన్నిటినీ వారు గమనించలేదు. శబ్దార్థనిర్ణయ విషయంలోను భాషాచరిత్ర నిరూపణంలోను భాషాశాస్త్ర పద్ధతులను పూర్తిగా పాటించటం జరగలేదు. భిన్న పాఠాంతరాలున్న శాసనాలను ప్రతిభావ్యుత్పత్తులున్న విద్వాంసులచేత పరీక్షింపజేసి పాఠనిర్ణయం చేయటం జరగలేదు.

ఇటువంటి అనేక కారణాలవల్ల 1958–60 మధ్యకాలంలో ప్రాచీనాంధ్రభాషా చారిత్రక వ్యాకరణాన్ని ఆధునిక పద్ధతుల్లో రచించటం ఆరంభించగానే ముడిసరకు పోగుచేసుకొని. కీర్తిశేషులు మల్లంపల్లి సోమ

శేఖరశర్మగారిచేత శాసన ప్రతిబింబాలన్నిటినీ మరోసారి చదివించుకొని, ప్రామాణిక పాఠనిర్ణయ కాలనిర్ణయాదులు చేసుకొన్న తరవాతగాని ముందుకు సాగటానికి వీలులేని పరిస్థితిలో పడ్డాను. ఉదకమండలంలో అముద్రితంగా పడివున్న శాసనప్రతిబింబాలను హెచ్. కె. నరసింహస్వామిగారు, కీర్తిశేషులు కె. హర్షవర్ధనశర్మగారు చదివి ప్రభుత్వంవారి ప్రాథమిక నివేదికలలోని పాఠాలను పరిష్కరించిపెట్టిన తరవాత భాషాచరిత్ర పరిశీలనకు ఉపయోగపడే అముద్రితశాసనభాగాలనుగూడా కొన్ని సేకరించాను. వాటినిగూడా ఇప్పుడు ప్రచురిస్తున్నాను. క్రీ. శ. 1100 వరకున్న శాసనాలు మాత్రమే నా పరిశోధనకు కావలసినవి. వాటినే ఈ గ్రంథంలో చూడగలరు.

ఇందులో 269 పూర్తి శాసనాలుగాని, తెలుగు మాటలున్న శాసనభాగాలుగాని, ఉన్నాయి. అత్యధికభాగం తెలుగులోనే ఉన్న శాసనాలు క్రీ. శ. 575కు ముందునాటివి దొరకలేదు. తొట్టతొలి తెలుగు శాసనం క్రీ. శ. 2వ శతాబ్ది నాటిది. ఈ 269 లో 217 శిలాశాసనాలు; 52 తామ్రశాసనాలు. వీటిలో మొత్తం 255 శాసనాలను వివిన్నపత్రికలనుంచి గ్రంథాలనుంచి సేకరించాను. ఈ 255 లో 187 శాసనాలు పూర్తిగా తెలుగుభాషలో ఉన్నవి; ఇవి A తరగతివని పరిగణించాను. 68 ఆంధ్రేతర శాసనాలనుంచి తెలుగు పదాలను, పదబంధాలను, చిన్నచిన్న వాక్యాలను సంగ్రహించాను. వీటిలో 60 సంస్కృత శాసనాలు; 7 ప్రాకృత శాసనాలు; 1 కన్నడ శాసనం వీటిని B తరగతి శాసనాలుగా వర్గీకరించాను. మిగిలిన 14 అముద్రితంగా ఉన్న తెలుగు శాసనాలభాగాలు; వీటిని C తరగతిలో చేర్చాను. ఈ కాలానికి చెందిన 200 శాసనాలు ఇంకా అముద్రితంగా ఉన్నాయి. ఆయా తరగతులకు చెందిన శాసనాలను కాలక్రమానుసారంగా ప్రచురిస్తున్నాను. సంగ్రహభాషా చరిత్రలోను, పదపట్టికల్లోను, ఈ సంకేతాలతోనే ఆయా పదాలను సూచిస్తుంటాను. మచ్చుకు, A 87.30:892-922 అంటే A తరగతికి చెందిన 87 క్రమసంఖ్యగల శాసనంలోని 30వ పంక్తిలోనని, ఆ శాసనం క్రీస్తుశకం 892-922 ల మధ్యకాలానిదని గుర్తించాలి.

శాసన కాలనిర్ణయం చిక్కుపని. A తరగతి చెందిన 134 శాసనాల్లో [1] కాలసూచన లేదు. చరిత్రాధారాలనుబట్టిగాని, లిపి స్వరూపాన్ని

1. A1-102, 104-110, 112-119, 133, 139, 143, 147, 157, 159, 166, 172-174, 181-185.

బట్టిగాని, కాలనిర్ణయంచేయుటం చరిత్రకారులకు పరిపాటి. రాజులను, రాజవంశాలను, చరిత్రాత్మక సంఘటనలను ఆధారం చేసుకొని 83 శాసనాల కాలాన్ని ఇంచుమించుగా నిర్ణయించవలసి వచ్చింది[2]. తాము వేయించిన ఇతరభాషా శాసనాల్లో పేర్కొన్న తమకాలాన్ని ఆధారం చేసుకొని ముగ్గురు వ్యక్తుల తెలుగు శాసనాల కాలనిర్ణయం చేయవలసి వచ్చింది.[3] మిగిలిన 48 శాసనాల విషయంలో లిపి శాస్త్రాధారాలతో భాషాశాస్త్రాధారాలుకూడా సరిపడిన తీరున కాలనిర్ణయం జరిగింది. ఒక శాసనకాలాన్ని నిష్కర్షగా సూచించటం అసాధ్యమయినప్పుడు చరిత్రవేత్తల అభిప్రాయభేదాలను గుర్తించి భేదపరిమితిని నిరూపిస్తూ శాసనాల కాలనిర్దేశం చేయటం జరిగింది. చరిత్రకారులూ లిపివేత్తలూ లిపిభేదాలు నిరూపించటంలోను, వాటినిబట్టి ఉజ్జాయింపుగా కాలనిర్ణయం చేయటంలోనూ చాలావరకు ఏకాభిప్రాయంలో ఉండటంవల్ల నాపని కొంత సుగమ మయింది. ఒక శాసనకాలం ఒకటి రెండు దశాబ్దాలు ఇటయినా అటయినా భాషాచరిత్ర నిరూపణ ప్రామాదికంకాదు కాబట్టి యావత్కాలభేదపరిమితినీ సూచించాను. సాధ్యమయిన సందర్భాల్లోకూడా 'Indian Ephimeris'ను సంప్రదించి నిశ్చితకాలం (తిథివారాలతోసహా) నిరూపించే ప్రయత్నం చేయలేదు. ఎందుకంటే ఈకాల నిర్ణయమంతా రమారమి వ్యవహారమే; ఇందువల్ల భాషాచరిత్రకు సంబంధించినంతవరకూ నిర్ణయాల్లో పెద్ద మార్పేమీ రాదు. కేవలం లిపిస్వరూపంమీదనే ఆధారపడి కాలనిర్ణయం చేయవలసి వచ్చినప్పుడు, ఆయా శాసనాల లిపి వాడుకలో ఉన్న కాలానికి చివరి హద్దును మాత్రమే వాటి కాలంగా నిర్ణయించాను. బుహ్లర్ పండితుడు 'Archaic script' అని వర్ణించిన లిపిభేదాన్ని ఇతరులు ఆయన వాడినంత సంయమనంతో వాడినట్లు కనిపించదు.[4] అందువల్ల ఆ లిపిభేదంలోని శాసనాలు ఆయన పేర్కొన్నకాలంకన్నా ఒక శతాబ్దం తరవాతివనిగాని అంగీకరించలేదు. ఏ ఒక్కశాసనాన్నీ భాషాస్వరూపాన్నిబట్టి నిర్దేశించదగని ప్రాచీనకాలంలో ఉన్నట్లు కేవలం లిప్యాధారంమీదనే నిరూపించలేదు.

---

2. A2-9, 11-13, 15, 16, 18, 20-25, 44-46, 48-52, 54-59, 74-90, 92, 94-97, 102, 104-110, 112, 113, 133, 136, 139, 143, 147, 157, 159, 162, 166, 172-174, 181-185.

3. A111, 126, 127.

4. IP, p.84.

30 ముఖ్యశాసనాల విషయంలో పాఠభేదాలు దొరుకుతున్నాయి[5]. లిపి స్వరూపనిర్ణయంలో వచ్చిన అభిప్రాయభేదాలు ఇందుకు ముఖ్యకారణాలయితే ముద్రణ స్ఖాలిత్యాలు దానికి సహాయపడ్డాయి. ఒక్కరే ఒక శాసనాన్ని అనేక పర్యాయాలు ప్రచురించినప్పుడుగాని, అనేకులు భిన్న స్థలాల్లో ఒకే శాసనాన్ని ప్రచురించినప్పుడుగాని ఈ పాఠభేదాలు వచ్చిపడ్డాయి. వాటన్నిటినీ నిరూపిస్తూనే ప్రామాణిక పాఠనిర్ణయం చేసి ఇక్కడ ప్రకటిస్తున్నాను. ప్రచురణ ప్రామాణ్యం, ప్రకాశక ప్రామాణ్యం, సంపాదక (/రచయితృ) ప్రామాణ్యం ఉత్తరోత్తర బలీయంగా భావించి ప్రధాన పాఠనిర్ణయం చేయటంలో నాకు సమస్త సహాయసహకారాలూ అందిచ్చినవారు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. చారిత్రక సాహిత్యిక ప్రాధాన్యమున్న 6 శాసనాల విషయంలో[6] ఈ పరిష్కరణ వ్యవహారం కష్టసాధ్య మయింది.

క్రీస్తుశకం ప్రథమసహస్రాబ్దంలోని ప్రతిశతాబ్దికీ చెందిన భాషావిశేషాలు ఈ శాసనాలద్వారా సమగ్రంగా లభించటంలేదు. 5వ శతాబ్ది చరమపాదంవరకూ B తరగతి శాసనాల్లో దొరికే వ్యక్తినామ స్థలనామాలే ప్రధానాధారాలు. C తరగతి శాసనాలద్వారా లభించే భాష మొత్తంలోని కొద్దిభాగమే ఇప్పుడు ప్రచురితమౌతున్నది; అయితే ఈ కించిద్భాగమూ భాషాచరిత్రకు ఎంతో తోడ్పడే మాధ్యమిక సోపానాన్ని సంతరిస్తున్నది. 7–10 శతాబ్దాల మధ్యకాల శాసనాల సంఖ్య అనిశ్చితంగా ఉంది. ఆనాటి సాంఘిక రాజకీయ సంక్షోభాలు కారణంగా శతాబ్దానుపాతంగా శాసనాల సంఖ్య పెరగలేదు. 1022 తరవాతి శాసనాలసంఖ్య మొత్తం శాసనాల సంఖ్యలో ఎక్కువభాగం.

ప్రచురిస్తున్న శాసనాల్లో అన్ని ప్రాంతాలకూ మండలాలకూ శాసన సంఖ్యనుబట్టి సమప్రాధాన్యం లేదు. రాజకీయ సరిహద్దుల్లో వస్తున్న, వచ్చిన మార్పులవల్ల కొన్ని సందర్భాల్లో శాసనస్థల నిర్ణయంకూడా దుర్ఘట మవుతున్నది. ప్రస్తుత రాజకీయ విభాగాల ప్రకారం చెప్తే, రాయలసీమలో దొరికిన ప్రచురిత శాసనాల సంఖ్య 74; గోదావరీదక్షిణతీరాంధ్రదేశంలో దొరికినవి 93; గోదావర్యుత్తర ప్రాంతంలో లభించినవి 62; తెలం

5. A3, 12, 16, 19, 23, 44, 46, 48, 49, 51, 80-82, 85, 86, 88, 89, 118, 123, 136, 1[illegible]9, 144; B4, 11, 22, 32, 45, 53, 63, 66.
6. A 80-82, 86, 88, 89.

గాణానుంచి దొరికినవి 4 మాత్రమే. 15 శాసనాలు దొరికిన ఉత్తర ప్రాంతం ప్రస్తుతం ఒరిస్సారాష్ట్రభాగం. ప్రస్తుత మధ్యప్రదేశ భాగమయిన బస్తర్ నుంచి లభ్యపడ్డవి 5 శాసనాలు. మరి 15 శాసనాలు దొరికిన స్థలం స్పష్టంగా తెలేదు. ఒకటి అలహాబాద్ శాసనం.

ఈ శాసనాలద్వారా దొరికే భాషాసామగ్రిమీద ఆధారపడి మాండలిక స్వరూపనిర్ణయం చేయటంకూడా ఎల్లప్పుడూసాధ్యపడదు. 7వ శతాబ్దివరకూ అవిచ్ఛిన్నంగా అన్ని శతాబ్దాల్లోనూ దొరికిన శాసనాలు గుంటూరు జిల్లావే. 7, 8 శతాబ్దాలకూ, మళ్లీ 10వ శతాబ్దానికి చెందిన భాషాసామగ్రి విషయంలో మాత్రమే మాండలిక భేదపరిశీలన సాధ్యం.

A తరగతికి చెందిన శాసనాల్లోని భాష నూటికి తొంభై పాళ్లు తెలుగే గాని కొన్ని ప్రత్యేకతలు లేకపోలేదు.[7] ఈ తరగతికి చెందిన 13 శాసనాల చివర సంస్కృతంలో శాపోక్తులున్నాయి. వాటిని ప్రచురించుటం లేదు. మరో 10 శాసనాలు[8] 1నుంచి 6పంక్తులదాకా సంస్కృత వాక్యాలతో ఆరంభమయినాయి. A78లోని తెలుగుపాఠం మధ్య ప్రాచీనకన్నడవాక్యాలున్నాయి. A56 ప్రధాన భాగమూ A175 శాసనకర్తృత్వవిషయమూ A73 మొత్తం పాఠమూ సంస్కృత పదబంధాలతో కలిసి మణిప్రవాళశైలిలో ఉన్నాయి. A59, 102, 121ల మధ్యభాగంలో చిన్న సంస్కృతపదబంధాలు కనిపిస్తాయి. ఈ తరగతికి చెందిన అనేక శాసనాల్లో లేఖకనామాదులను సూచించే సంస్కృతవాక్యమో పదబంధమో కనిపిస్తుంది సంస్కృతకర్ణాట వాక్యాలను ప్రచురణలో వదిలివేశాను. B తరగతికి చెందిన 12 శాసనాల్లో[9] సంస్కృతవాక్యాల మధ్య తెలుగు పదబంధాలు కనిపిస్తాయి. ఈ తరగతికే చెందిన మరో 6 శాసనాల్లో[10] తెలుగు వాక్యాలే దొరుకుతున్నాయి. వీటిని మాత్రం ప్రచురిస్తున్నాను. పై విధంగానే C8, 9 శాసనాల్లో సంస్కృత కర్ణాటవాక్యాల మధ్య తెలుగు వాక్యాలున్నాయి. వీటిని కూడా ప్రచురిస్తున్నాను.

ఈ శాసనాల్లో అత్యధిక సంఖ్యాకాలు దానధర్మాలను వివరిస్తూ వచనంలో ఉన్నవే. విషయబోధ కూడా గతానుగతిక మార్గంలోనే ఉంది.

---

7. A 22, 24, 48, 109, 118, 119, 120, 123, 130, 131, 134, 148.
8. A 80, 126, 127, 135, 136, 139, 140, 144, 148, 149.
9. B 14, 28, 38, 42, 43, 47, 51, 53, 59-61, 67, 68.
10. B 32, 44, 45, 54, 64, 68.

బిరుద గద్యలు కొన్నింటిలో కర్ణాటమిశ్రితసంస్కృతం ఉంది. కొన్నింటిలో ధర్మ పాతులను గూడా పేర్కొన్నారు. వీటిలోని భాష సాధారణంగా వ్యావహారికం. కొన్ని మాత్రం 7వ శతాబ్దినుంచీ గ్రాంథికధోరణిలోనే రాసినవి దొరుకుతున్నాయి. కొరవిశాసనం రచనాపద్ధతిలో నన్నయ వచన రచనకు దీటుగా ఉంటుంది. 6 శాసనాలు మాత్రం[11] పద్యరచనలు; అంటే 'వృత్తగంధి' వచనాలను నేను లెక్కలోకి తీసుకోవటం లేదన్నమాట. ఈ పద్యశాసనాలు లిపిముఖంగా గుర్తించరాని అర్ధానుస్వారాన్ని పునరుద్ధరించటానికి ఎంతో ఉపయోగపడతాయి. దానికి ప్రత్యేక విపిసంకేతం లేనందువల్ల ఛందస్సే శరణ్యమవుతున్నది.

ఈ ప్రచురితశాసనా లన్నిటిలోనూ నా దృష్టిలో రెండు విలక్షణమైనవి. వాటిలో మొదటిది ఇంతవరకు అముద్రితంగా ఉన్న రండుబల్లి తామ్రశాసనం (C5); రెండోది కలకడ శిలాశాసనం (A112). శ్రీనాధుడి తాతగారి ఊరని వారిధితటంలో ఉండాలని కొమర్రాజు లక్ష్మణ రావు పంతులు గారు వ్యయప్రయాసలు పడి వెతికించిన 'కల్పట్టనము' C5లో 27వ పంక్తిలో కనిపిస్తుంది. ఈ తామ్రశాసనం గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని రండుబల్లిలో దొరికింది. శాసనకాలం క్రీ. శ. 764-99. సాహిత్య చరిత్రకారులకు ఇది అమూల్యమైన విషయం. రెండో శాసనం చిత్తూరు జిల్లా వాయల్పాడు తాలూకాలోది. క్రీ. శ. 972 నాటిది. దాని 13-15 పంక్తుల్లో మనుస్మృతిలో చెప్పిన వ్యభిచార విషయిక శిక్షాస్మృతి స్మరణకు తేబడింది. సాంఘిక చరిత్రకారులకు ఇది వెలలేని విషయం.

A తరగతికి చెందిన 157 శాసనాల్లోనూ రెండు తప్ప మిగిలినవి ఏదో ఒకరకం తెలుగులిపిలోనే ఉన్నాయి. A1 'బ్రాహ్మీ' లిపిలోను, A 85లోని తొలిపంక్తులు బ్రాహ్మీ జాతికి చెందిన 'దేవనాగరి' లిపిలోను ఉన్నాయి. A1 లోని బ్రాహ్మీనే 'ద్రావిడీ/డామిలీ' లిపి అంటారు. ఇది బ్రాహ్మీలిపి మూలరూపం నుంచి క్రీ. పూ. 5వ శతాబ్దంలో వేరుపడ్డ భట్టిప్రోలు శాఖకు చెందింది.[12] బ్రాహ్మీ లిపి అత్యంత ప్రాచీనమైన ఉత్తర సెమెటిక్ వర్ణమాల నుంచి ఏర్పడి, రమారమి క్రీ. పూ. 9-10 శతాబ్దాల మధ్యకాలంలోనో అంతకుముందో భారతదేశంలో వాడుకలోకి వచ్చిందని

11. A 81, 82, 88, 89, 136, 144.

12. జి. బుహ్లర్, IP, p. 16.

బుహ్లార్ విశ్వాసం[13]. ప్రాచీన భారతీయ వ్యాకర్తలు ఈ విభేదాన్ని క్రీ.పూ. 500 ప్రాంతాల్లో సంస్కరించారని, ఈ సంస్కృత రూపంలోనే ఇది క్రీ. పూ. 3వ శతాబ్దినాటి అశోకశాసనాలో ఉపయుక్తమయిందని, లిపిశాస్త్రజ్ఞు లంటారు.[14] ఈ లిపిభేదమే క్రీ. పూ. 350 ప్రాంతాల నుంచి క్రీ. పూ. 200 ప్రాంతాల వరకు కృష్ణానదికి రెండు వైపులా వాడుకలో ఉండివుంటుందని విశ్వసిస్తున్నారు.[15] అయితే బుర్నెల్ మాత్రం ఈ లిపి క్రీ. శ. 4వ శతాబ్ది వరకూ వాడుకలోఉందని వాదిస్తాడు.[16] బుర్నెల్ 'వేంగీ చాళుక్యలిపి' అనీ, ఇతరులు 'తెలుగు-కన్నడ లిపి'అనీ, వ్యవహరించే లిపిభేదం పై లిపి నుంచే ఏర్పడ్డది.[17] బుహ్లార్ మతంలో ఈ లిపికి గణనీయ భేదంగల శాఖలు మూడున్నాయి : (1) సుమారు క్రీ. శ. 578-668లకు మధ్యకాలంలోనో అంతకింకా ముందో వాడుకలో ఉన్న 'ప్రాచీన లిపి భేదం' (archaic variety) మొదటి శాఖకు చెందింది. (2) తూర్పు చాళుక్యుల తామ్ర శాసనాల్లో మాత్రమే కనిపించే 'మాధ్యమికలిపి' (Middle variety) రెండోది దీన్ని బుర్నెల్ 'చాళుక్య లిపి' అనేవాడు. క్రీ. శ. 650-950లకు మధ్య కాలంలో ఇది వ్యవహారంలో ఉండేది. (3) బుర్నెల్ 'సంధికాలలిపి' (the transitional script) అని, ఫ్లీట్ 'ప్రాచీన తెలుగు-కన్నడ లిపి' (the old Telugu-Kannada script) అని, వ్యవహరించింది మూడోది. ఇది ఇంచుమించు క్రీ. శ. 1000 నుంచి 1300 వరకు వాడుకలో ఉంది.[18] ఈ లిపిభేదం క్రీ. శ. 1200 నాటికే వ్యవహారదూర మయిందని కొమర్రాజు లక్ష్మణరావుగారు వాదిస్తుండగా, క్రీ. శ. 8, 9, 10 శతాబ్దాల్లోనే ఇది వాడుకలో ఉండేదని బుహ్లార్ భావిస్తున్నాడు.[19] తెలుగు-కన్నడ లిపులు క్రీ. శ. 1300 ప్రాంతంలో వేరుపడ్డాయంటారుగాని, అల్-బీరూనీ

13. అదే, పే. 24-25, 33-34; I.J. Gelb, SW, pp. 187 and 201.
14. బుహ్లార్, IP, p. 34. 15. అదే, పే. 47, 49, ముఖ్యంగా 57.
16. A.C.Burnell, ESIP, p.12. 17. అదే,పే.14; G. Buhler,IP,p.81
18. G. Buhler, IP, p. 81-87 and A.C. Burnell, ESIP, p. 25.
19. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము 1.374, 377; G. Buhler, IP, p. 92.

క్రీ. శ. 1030 నాటికే ఈ రెండు లిపులూ భేదించినట్లు గుర్తించాడు.[20]

ప్రస్తుత గ్రంథంలోని శాసనాల్లో తెలుగు-కన్నడ సాధారణలిపిలోని మొదటి రెండు విభాగాలే తటస్థపడ్డాయి. 'వేంగీ చాళుక్య లిపి' లోని నాలుగు శాసనాలూ (A 17, 18, 25, 36) క్రీ. శ. 7వ శతాబ్దినాటివనే నిర్ణయం. వీటిని కింద నుంచి పైకి చెక్కేరు. 'ప్రాచీనలిపి' లోని పదకొండు శాసనాలనూ (A 62-64, 66-73) క్రీ. శ. 8వ శతాబ్దివనే భావించాను. 'పూర్వకాలలిపి' (ancient script)లో ఉన్నవని పురావస్తుశాఖవారి నివేదికలు పేర్కొన్న ఆరు వైదుంబ శాసనాలనూ (A 92-94, 98, 100, 101) క్రీ. శ. 9/10 శతాబ్దాలవని గుర్తించాను. అంటే అవి ఈ రెండు శతాబ్దాల్లో ఎప్పటివయినా కావచ్చు. 'ప్రాఙ్నన్నయ' కాలానివని చెప్పే మూడు శాసనాలనూ (A 116-118) క్రీ. శ. 10వ శతాబ్దానివిగా పరిగణించాను

భారతీయ శాసనాల్లో మొట్టమొదటి సారిగా శాసనకాలాన్ని అంకెలలో పేర్కొనటం క్రీ. శ. 8వ శతాబ్దానికి చెందిన శ్రీకాకుళ శాసనంలోనే జరిగింది.[21] ప్రచురిత శాసనాల్లో A 11 లోనే శకసంవత్సరం మినహా తక్కిన వివరాలన్నీ మొదట దొరికేయి. ఇది క్రీ. శ. 600-50 నాటిది. క్రీ.శ. 914 నాటి A 103 శాసనంలో కాలం స్పష్టంగానే ఉందిగాని 'శక' శబ్దం మటుకు లేదు. అన్ని వివరాలూ స్పష్టంగా ఉన్న మొదటి తెలుగు శాసనం క్రీ. శ. 972 నాటి A 111. అంకెలకు బదులు మాట ఉపయోగించి కాలనిరూపణ చేయటం క్రీ. శ. 815 నుంచి మాత్రమే మనదేశంలో వాడుకలోకి వచ్చింది.[22] ఇటువంటి తెలుగు శాసనాల్లో మొట్టమొదటిది క్రీ. శ.

---

20. A.C. Burnell, ESIP, p.25, f.n. 4. తెలుగు లిపి పరిణామక్రమం తెలుసుకోవటానికి మరికొన్ని ఆధారగ్రంథాలు: (i) గంటి జోగిసోమయాజి, ఆంధ్రభాషా వికాసము (1948), పే. 257-60; (ii) C. Sivaramamurti, IESIS, pp. 42-54 and 150-54 (iii) కొమర్రాజు వేంకటలక్ష్మణరావు, 'అక్షరములు', ఆంధ్రవిజ్ఞానసర్వస్వము, 1.334-97; (iv) మల్లంపల్లి సోమశేఖరశర్మ, విజ్ఞానసర్వస్వము (తెలుగు భాషా సమితి), 3.1056-60; (v) వేటూరి ప్రభాకరశాస్త్రి, తెలుఁగు మెఱుఁగులు, పే. 93-100; (vi) తిరుమల రామచంద్ర, మనలిపి పుట్టు పూర్వోత్తరాలు, పే. 97-160, మొదలైనవి.
21. G. Buhler, IP, p. 105
22. Ibid; p. 106.

1006 నాటి A 119 కాల సంఖ్యా సూచనకు సాంకేతిక శబ్దాలు వాడిన తొలి తెలుగు శాసనం క్రీ శ. 1075-76 నాటి A 144.

శాసనాల్లోని పాఠభేదాలకు రెండు ముఖ్య కారణాలు: మొదటిది భిన్న వర్ణాల రూప సాదృశ్యం; లిపికారుల, లేఖకుల, శిల్పుల లేఖనపద్ధతులే గాక నిర్లక్ష్యభావం కూడా రెండోది. థకార అకారాలకుగల పోలిక అనేకాప పాఠాలకు దారి తీసింది. క్రీ. శ. 1200 వరకు డకారళకారాలకు ఇంచు మించు ఒకేవిధంగా ఉండే లిపిసంకేతం ఉండేది.[23] దడలు, అ ఆలు, ఇటు వంటి ఇబ్బందులు పెట్టేవే. క్రీ. శ. 17వ శతాబ్దివరకూ శాసనలిపిలో ఎకార, ఒకారాల హ్రస్వదీర్ఘతలు స్పష్టంగా సూచితం కాలేదు.[24] ఈ, ఊ, లు తప్ప తక్కిన అచ్చుల దీర్ఘత్వాన్ని సాధారణంగా గుర్తించేవారు కారు.[25] జాగ్రత్తగా చూస్తే ఈ, ఊ, ల విషయం కూడా అంతలోనే ఉంది. ద్విరుక్త హల్లులకు బదులు అద్విరుక్తాలు రాయటం, మహాప్రాణాలకు ముందున్న అల్ప ప్రాణాలను వదిలివేయటం. సర్వసామాన్యంగా ఉండేది[26]. అనుస్వార రేఫల తరవాతి స్పర్శవర్ణాలను ద్విత్వంగా రాయటం సర్వత్రా లేదుకాని ఎక్కువగానే ఉండేది. [27] అనుస్వార విషయం విశిష్టమయింది, చేర శాసనాల్లో పంక్తిమీద, చాళుక్య శాసనాల్లో సహపంక్తిలో, అనుస్వార చిహ్నామైన బిందువును (.) ఉంచేవారని బుర్నెల్ గమనించాడు. [28] అరసున్నకు ప్రత్యేకమైన చిహ్నం లేదు. మొదట మొదట బిందువును తరవాతి అక్షరానికి పైన కుడివైపునో ఎడమ వైపునో ఉంచేవారు. ఆ 'చుక్క' కాలక్రమాన 'సున్న' (०)గా మారింది. నన్నయకాలంలో ఈ సున్నను పంక్తిమీద అక్షరానికి కుడివైపున రాశేవారు. నన్నయ సమ

23. A. C. Burnell, ESIP, p. 28.
24. కొమర్రాజు లక్ష్మణరావు, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము, 1-378; తిరుమల రామ చంద్ర, మన లిపి పుట్టుపూర్వోత్తరాలు, పే. 131, 132, 135; A. C. Burnell, ESIP, p. 30.
25. G. Buhler, IP, p. 48; తిరుమల రామచంద్ర, మన లిపి పుట్టు పూర్వోత్తరాలు, పై పేజీలు.
26. G. Buhler, IP, p, 48.
27. అనుస్వారం మీది ద్విత్వాల విషయం: మన లిపి పుట్టు పూర్వోత్తరాలు, పే. 138-40; రేఫ తరవాతి ద్విత్వాల విషయం : HGOK, p. 12, f. n. 31.
28. ESIP, P. 30; MLPP. pp. 137-142; IP, pp. 48 and 88.

కాలంలోని కొన్ని శాసనాల్లోనూ తరవాతి కాలంలోనూ 'సున్న' తక్కిన అక్షరాలతోబాటు సపంక్తిలోనే కనిపిస్తుంది. క్రీ. శ. 2వ శతాబ్దినాటి ప్రాకృత శాసనాల్లో కూడా అనుస్వార చిహ్నాన్ని వదిలివేయటం సాధారణంగా ఉండేది.[29] అనునాసిక వర్ణాలకు బదులుగా రానే 'సున్న' సరిగా కనిపించనందువల్ల గాని, ఒక్కొక్కప్పుడు శాసనఫలకంమీది ఏ గుంటనో నొక్కునో అనుస్వారచిహ్నమని భ్రమించినందువల్లగాని, అపపాఠాలు అనేకంగా సంభవించి భాషాధ్యయనంలో చిక్కులు తెచ్చిపెడుతుంటాయి[30]. అనుస్వారచిహ్నాన్ని వర్గానునాసికాలకు ప్రత్యామ్నాయంగా వాడుతున్నందువల్ల తెలుగులో ఈ చిక్కులు మరీ ఎక్కువ.

ఱ, ళ, ఴ, ౘ-అనే అక్షరాలు ఈ శాసనాల్లో చాలా ప్రాచీనకాలం నుంచీ లభ్యమవుతున్నాయి. ఱకార చిహ్నం మొట్టమొదటి సారిగా క్రీ. శ. 508 నాటి B13లో కనిపిస్తుంది.[31] ళకార చిహ్నం మొదటిసారిగా క్రీ.శ. 428 నాటి B9లో కనిపిస్తుందిగాని ఆ శబ్దవ్యుత్పత్తి ఇప్పటికి తెలేదు. శకట రేఫ క్రీ. శ. 395-410 నాటి B8లో మొదటిసారిగా 'అఱునొఱు' అనే స్థల నామంలో కనిపిస్తుంది. 'న్ఱ' అనే సంయుక్త వర్ణానికి ప్రత్యేక చిహ్నం ఉండేది. రూపంలో ఇది థకార చిహ్నాన్ని పోలి వుండేది. విభిన్న విద్వాంసులు ఈ చిహ్నానికి భిన్నకాలాల్లో భిన్న స్థలాల్లో భిన్న విధాల విలువలిచ్చారు. దీనికున్న ప్రత్యేకత ఎప్పుడూ నకారంతో కలిసి సంయుక్త హల్రూపంలో ద్వితీయవర్ణంగా మాత్రమే కనిపించటం. ఈ చిహ్నం క్రీ.శ. అయిదో శతాబ్దంనాటి B 12 లో మొట్టమొదటిసారి కనిపిస్తుంది[32]. ఇటీవల ఒకే ఒక శాసనంలో ఇది ణకారంతో కలిసి ప్రయుక్తమయినట్లు నిదర్శన లభించింది.[33]

29. చూ. పై.
30. J. Ph. Vogel as quoted by M. A. Mehendale, HGIP, p. 107.
31. C. Sivaramamurthi, IESIS, p. 151; తిరుమల రామచంద్ర, మన లిపి పుట్టు పూర్వోత్తరాలు, పే. 104; మల్లంపల్లి సోమశేఖరశర్మ, విజ్ఞానసర్వస్వము, 3.1057.
32. కోరాడ రామకృష్ణయ్య, JVOI, 12.18-20; 110-111.
33. A58 శాసనపాఠం చూడండి.

ప్రచురిత శాసనాల్లో ఌ, ౡ, ఋూ అనే అచ్చుల ప్రాథమిక చిహ్నాలు గాని, ద్వితీయ రూపాలుగాని లేనేలేవు. ఐ, ఔ-ల ప్రాథమిక చిహ్నాలు కూడా కనిపించవు. జ్ఞ కార చిహ్నంకూడా ఈ శాసనాల్లో కనిపించదు.

రేఫ మీది స్పర్శవర్ణాలను ద్విరుక్తం చేయటం సంస్కృత లేఖన సంప్రదాయం నుంచి ఎరువుగా వచ్చింది. క్రీ. శ. 7వ శతాబ్దంనుంచీ తత్సమతద్భవాలతోబాటు దేశ్య శబ్దాలను కూడా ఈవిధంగానే రాశేవారు. ఈ ఆచారం క్రీ. శ. 11వ శతాబ్దం నుంచి తత్సమ శబ్దాల విషయంలో తగ్గుతూ వస్తే దేశ్యాల విషయంలో స్థిరపడిపోయింది. బిందువుమీది పరుషస్వరశాలను ద్విరుక్తం చేసి రాసే ఆచారం క్రీ. శ. 9/10 శతాబ్దాల నుంచి మాత్రమే ఆరంభమయింది. ఈ శాసనాల్లో అద్విరుక్తంగా ఉన్న సందర్భాలు 847 కాగా ద్విరుక్తమైన సమయాలు 36 మాత్రమే. అంటే ఈ సంప్రదాయం క్రీ. శ. 1100 నాటికి ప్రాచుర్యంలోకి రాలేదన్నమాట.

ఈ గ్రంథంలో సాంఘిక రాజకీయ చరిత్రలకు భాషాచరిత్రకు ఇచ్చినంత ప్రాముఖ్యం ఇవ్వలేదు. ఆ యా శాసన పాఠాలకిందనే వాటి కాల నిర్ణయానికి తోడ్పడ్డ చారిత్రకాధారాలను, విద్వాంసుల చర్చలకు సూచనలను, పాఠభేదాలను ఇచ్చాను. ఆంగ్ల లిపితో పరిచయంలేని విద్వాంసులకుగాని, తెలుగులిపి పరిచయం అంతగాలేని ఆంధ్రేతర పండితులకుగానీ, ఇబ్బంది లేకుండా ఉభయలిపుల్లోనూ శాసనపాఠాల నిచ్చాను. అయితే పాఠభేదాలను గ్రంథవిస్తరభీతివల్ల ఆంగ్లంలో మాత్రమే పాదదీపికల్లో నిర్దేశించాను. ఆ యా తరగతులకు చెందిన శాసనాలను కాలక్రమానుసారంగా ప్రచురించిన తరవాత శాసనగత పదప్రయోగ పట్టికను ఆంధ్రాంగ్ల భాషాలిపులు రెంటిల్లోనూ ఇచ్చివున్నాను. ఆ యా శబ్దాల వ్యాకరణ స్వరూప నిర్దేశాన్ని, సజాతీయభాషా పదాలను, పునర్నిర్మిత రూపాలతో సహా వ్యుత్పత్తులను, ముద్రణ సౌకర్యంకోసం రోమన్ లిపిలో, ఆంగ్ల భాషలో మాత్రమే ఇవ్వగలిగేను. గ్రంథవిస్తృతిని సంక్షేపించటంకోసం ప్రధానమని భావించిన ఇతరభాషా పదాలను, ముఖ్యమనుకొన్న పండితాభిప్రాయాలను మాత్రమే పేర్కొని వివరాలకోసం 'Dravidian Etymological Dictionary' వంటి మహాగ్రంథాల్లోని ఆయా ఆరోపాల సంఖ్యనుగాని, ముఖ్యచర్చలకు సంబంధించిన వివరాల సూచనగాని, సందర్భాన్నిబట్టి సంతరించాను. ఇక ఈ శాసన భాషాధ్యయనంవల్ల తెలిసే ముఖ్యవిశేషాలను

ఆంధ్రాంగ్లభాషల్లో ప్రత్యేకవ్యాసరూపంలో సంగ్రహంగా వివరించాను. ఈ వ్యాసాలు ప్రాచీనాంధ్రభాషా చారిత్రక వ్యాకరణానికి సంక్షిప్తరూపాలు; నా పరిశోధన వ్యాసంలోని ప్రధానభాగాలు.

ఈ శాసన సేకరణలో, పాఠ పరిష్కరణలో అమూల్యమైన సహాయ సంపదలిచ్చిన చరిత్ర పరిశోధక చక్రవర్తి కీర్తిశేషులు మల్లంపల్లి సోమశేఖర శర్మగారికి ఈ గ్రంథాన్ని అంకితం చేయటంకన్నా నేను చేయగలిగింది లేదు. వారికి అమరత్వం సిద్ధించుగాక.

శాసన సంపాదన సమయంలో నాకు అనేకవిధాల తోడ్పడ్డ పెద్ద లందరికీ నా కృతజ్ఞతలు. కీర్తిశేషులు ముట్నూరి వేంకట రామయ్యగారు, కొల్లూరి హర్షవర్ధనశర్మగారు, శ్రీయుతులు డి. సి. సర్కార్, హెచ్. కె. నరసింహస్వామిగారలకు నే నెంతో రుణపడివున్నాను. పరిశోధన సమయంలో కొంతకాలానికి ఉపకారవేతన మిచ్చిన భారత ప్రభుత్వానికి, గ్రంథాలయ సౌకర్యాలు కల్పించిన అబ్బూరి రామకృష్ణరావు, అడుసుమిల్లి శ్రీనివాసరావుపంతులుగారలకు నా ప్రత్యేక కృతజ్ఞతలు. పరిశోధన వ్యాసంగంలో తోడ్పడ్డ ఆచార్యులు గంటి జోగిసోమయాజి, భద్రిరాజు కృష్ణమూర్తి, నిడుదవోలు వేంకటరావు, టి. మహాలింగంగార్లను విస్మరించలేను. పరిశోధనావకాశం కలిగించిన ఆంధ్ర విశ్వకళాపరిషదధికారులకు. చీరాల వి. ఆర్. ఎస్. అండ్ వై. ఆర్. ఎన్. కళాశాధికారులకు, నా కృతజ్ఞతలు.

ప్రచురణభాగ్యంలేని పరిశోధన నిష్ప్రయోజనకరం. నా ప్రయాసను గుర్తించి ఈ గ్రంథాన్ని ముద్రించటానికి అంగీకరించిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ పాలకవర్గంవారికీ, విశేషించి విద్వజ్జన పరిశ్రమను ఆదరించే తత్కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికీ, నే నెంతో రుణపడివున్నాను.

రెండు భాషల్లో రెండు లిపుల్లో అనేక ప్రత్యేకచిహ్నాలతో ముద్రించటం ఎంత కష్టసాధ్యమో అనుభవైకవేద్యం. ఈ గ్రంథముద్రణ క్లేశదాయకమైనా నీటుగా చేసిన బి.వి.ఆర్. బాలిరెడ్డి అండ్ కంపెనీ (సికిందరాబాద్) వారికి నా కృతజ్ఞతలు.

బూదరాజు రాధాకృష్ణ.

# విషయసూచిక (CONTENTS)

# INTRODUCTION

The inscriptional material collected nearly more than twelve years ago with a view to prepare a historical grammar for early Telugu is being published now after a long time thanks to the help and assistance rendered by the Andhra Pradesh Sahitya Akademi. The inscriptions are not available from any one source; they are not published by any one person herebefore. Some of these are still unpublished.

One will come to know that there are still many Telugu inscriptions which will have to be published if only he peruses through the Annual Reports of the Epigraphy Department of the Govt. of India. The situation saddens us. There is no hope that they will ever be published unless the Government of Andhra Pradesh take necessary steps to bring them into light. But the number of inscriptions already published will be adequate to prepare a history of the language. Several scholars interested in the early Telugu history have published the texts of inscriptions in support of their arguments. Different scholars published them with different text versions. Some studied some inscriptions and a few text versions. The number of inscriptions available through published sources dating from the 'Andhra bhāṣā caritra' of C.Narayana Rao till 'the Evolution of Telugu' by K. Mahadeva Sastry are limited. They have not taken into account all the discussions concerning the dating of the inscriptions. They have not strictly followed the modern linguistic methodology while studying the etymologies of the various inscriptional words and while accounting for the history of early Telugu. They have not resolved the various text versions of some important inscriptions by getting them examined by competent historians and epigraphists.

Owing to these and many other reasons, I could not straight away proceed on my work during 1958-60 until after I collected the material once again from both the published and unpublished sources and got the texts examined by the late M. Somasekhara Sarma with the aid of impressions and facsimilies and finalised the text versions and dates of the inscriptions. I collected the texts of a few unpublished inscriptions available

with the Government Epigraphist, Ootacamund, and got them reread from the impressions by H. K. Narasimhaswamy and the late K. Harshavardhana Sarma. They are also published now. I needed inscriptions upto 1100 A.D. for my research and they are now published here.

There are 269 complete Telugu inscriptions or portions of inscriptions with Telugu words in this work. Complete Telugu inscriptions which are datable earlter than 575 A.D. are not available. The very first inscription is assigned the 2nd cent. A.D. 217 out of the 269 are rock- edicts and the remaining 52 Copper-plate grants. A total of 255 inscriptions are gathered from various books and periodicals. Of them, 187 are complete Telugu inscriptions. They are classed as A-series. Telugu words, phrases and short sentences are gathered from 68 non-Telugu inscriptions of which 60 are Sanskrit inscriptions, 7 Prakrit inscriptions and 1 Kannaḍa one. These are classed as B-Series. The remaining 14 contain portions of unpublished Telugu inscriptions which are grouped as C-Series. There are still nearly 200Telugu inscriptions of the period which remain unpublished. The inscriptions of the three series are arranged and published separately in chronological order. Words are referred to in the brief history of the language and in the index verborum by a formula. To illustrate, A87.30:892–922 means that the term referred to is found in line 30 of the inscription no.87 of the A-Series whose chronological range is from 892 A.D. to 922 A.D.

Dating of inscriptions is a difficult job. In as many as 134 inscriptions of the A-series[1], dates of grants are not mentioned within the texts. But it is a common practice among the editors to discuss and fix the date of a grant on historical and paleographical grounds. 83 inscriptions of the A-series[2] have thus been assigned approximate dates on the basis of the names of kings, personalities, dynasties, historical events, etc. occurring in them. 3 more inscriptions in this series[3] are assigned dates from the evidence occurring in certain other grants by the same donors written in Sanskrit and Kannaḍa. The remaining 48

1. A1-102, 104-110, 112-119, 133, 139, 143, 147, 157, 159, 166, 172-174 and 181-185.
2. A2-9,11-13, 15, 16, 18, 20-25, 44-46, 48-52, 54-59, 74-90, 92, 94-97, 102, 104-110, 112, 113, 133, 136, 139, 143, 147, 157, 159, 162, 166, 172-174 and 181-185.
3. A111, 126, 127.

inscriptions are dated on paleographic grounds, supported by linguistic considerations. Historians and epigraphists are nearly unanimous in naming 'the variety of script' employed in an inscription and also in broadly assigning a date to it. Nevertheless, differences of opinion regarding the dates of certain inscriptions occur because of disagreement in the interpretation of history. Care has been taken here to record the whole range difference among contemporary historians in dating a given of inscription. No attempt has been made here to consult "Indian Ephemeris" to fix up the *exact* dates (even in cases where it is possible to do so) because most of the dates are only approximate and they do not affect our conclusions. While dating the inscriptions on paleographic grounds alone, care is taken to assign them to the latest period of time to which the particular variety of script employed therein belonged. Inscriptions in '*archaic*' script are assigned to a period later by a cetnury than the date given by G. Bühler[4] since, the term is found to have been used by others less reservedly than he did. But in no case, an inscription datable purely on paleographic grounds was taken up for study if the linguistic evidence does not indicate its antiquity.

Different text versions are noticed in the case of 30 inscriptions.[5] This situation is due mainly to problems of decipherment and errors in print in some cases. Inscriptions with considerable historical and literary importance[6] have been edited and re-edited by many scholars resulting in many text versions. All the important text versions have been recorded at the foot of each text (given in Roman transcription). The standards of a publication, the reputation of an editor and the latest and undisputed nature of a text and its date have all been taken as criteria for the final selection of the text version and the date of every inscription published here. It was the Late M. Somasekhara Sarma who helped me out of these problems in every way.

The inscriptional material is not evenly available from all the regions and districts comprising the present state of Andhra

4. IP,p.84.
5. A3, 12, 16, 19, 23, 44, 46, 48, 49, 51, 80-82, 85, 86, 88, 89, 118, 123, 136, 139 and 144; B 4, 11, 22, 32, 45, 53, 63 and 66.
6. A80-82, 86, 88 and 89.

Pradesh and during all the centuries of the first millennium A.D. Owing to changes made in political boundaries from time to time, 'find-spots' have had to be rearranged on the present political map. 74 inscriptions are available from the Rāyalasīma region, 93 from south coastal region (south of the river Godavari), 62 from north coastal region, and only 4 from the Telangāna region. A certain part of territory from where 15 inscriptions are collected is now in the Orissa state. 5 inscriptions are from Bastar and one from Allahabad. The 'find spots' of 15 other inscriptions are not clearly known.

No areal study is possible out of the material (in many cases) of the pre-7th century since it is available mostly from the inscriptions found in the Guntur district. Comparison of dialectal material (excepting from Telangāna) is possible only during the 7th and 8th centuries and again during the 10th century.

The language of the inscriptions of A-series is predominantly Telugu with certain peculiarities in some cases. 13 inscriptions of this series[7] contain imprecatory verses in Sanskrit which portions are not published here. 10 more inscriptions[8] begin with Sanskrit sentences running into 3 to 6 lines. A78 contains an ancient Kannaḍa passage in the middle of the Telugu text. The operative part of A56, the authorship of A175 and the whole text of A73 are written blended with Sanskrit phrases (in what is known as 'maṇipravāḷa' style of a literary composition). The middle portions of A59,102 and 121 contain fragmentary Sanskrit phrases. Many more inscriptions of this series contain an occassional Sanskrit phrase or a short sentence indicating the name of the scribe, etc. of a grant. But these non-Telugu portions are left out in the publication of texts. 12 inscriptions of B-series[9] contain Telugu phrases inserted into Sanskrit sentences and 6 others of this series[10] contain even a few Telugu sentences. Simimilarly, C3 and 9 have Telugu sentences in the middle of mainly Sanskrit and Kannaḍa inscriptions, respectively. These are also published here.

7. A22, 24, 48, 109, 118, 119, 120, 123, 130, 131, 134 and 148.
8. A80, 126, 127, 135, 136, 139, 140, 144, 148 and 149.
9. B14, 28, 38, 42, 43, 47, 51, 53, 59-61, 67 and 68.
10. B32, 44, 45, 54, 64 and 68.

Most of rhe inscriptions refer to gifts or grants made by kings or highly placed persons and their contents are generally stereotyped. The invocatory passages mentioning royal and personal titles in some cases are written in lengthy Sanskrit compounds with an admixture of Kannaḍa. In some inscriptions witnesses to grants are also mentioned. The language variety employed in most inscriptions is colloquial of the times. One Koravi inscription compares well with the prose of Nannaya in style and execution. Six inscriptions[11] are metrically composed. I have not taken into consideration such of the inscriptions which are said to have been composed metrically in parts. The inscriptions in verse are very useful leading to 'reconstitution' of the half-nasal that had no exclusive graphemic representation in the inscriptional orthography of any period.

Of all the inscriptions published here, two are more significhnt atleast in my view, the first of them being the hithertofore unpublished copper-plate grant from Randuballi (C5) and the other being the Kalakaḍa rock-edict (A 112). The township ruled by Kamalanābha, the grand-father of the great Telugu poet Srīnātha, which was searched for with great zeal and at a great expense by the Late K. Lakshmana Rao occurs in line 27 of C5 in the form of 'kalpaṭṭanabu'. This grant is collected from Raṇḍuballi in Bapatla tq., Guntur Dt. and is dated 764-99 A. D. This is a precious information for the literary historians. The second inscription is from Vāyalpādu tq., Chittoor Dt. and is dated 972 A. D. The juridical points made out in Manusmṛti concerning adultery are repeated in Telugu in lines 13–15 of the inscription. This is a priceless information for social historians.

All but two of the 187 inscriptions of A-Series are engraved in the Brāhmī syllabary. The first few lines of A85 are engraved in Dēvanāgarī variety of the Brāhmī script to be followed by the Telugu-Kannaḍa script for the major portion of the text. The Brāhmī script employed in A1 is of the Bhaṭṭiprōlu variety (also called drāviḍī or ḍāmilī)[12] which got separated from the main stock of Brāhmī during the 5th cent. B. C. The Brāhmī script itself, according to G. Buhler, was derived from the oldest of the North Semetic alphabets which was introduced into India

11. A81, 82, 88, 89, 136 and 144.
12 G. Buhler, IP, p. 16.

by c 800 B.C.- 10th cent. B. C. or even earlier[13]. It was elaborated and modified by the ancient Indian grammarians and philologists by c500B.C. or earlier and was used in the Asokan edicts of the 3rd cent B. C. in its modificd from[14]. This script was probably in use in the territory on both flanks of River Kṛṣṇa from about 350 B. C. till about 200 B. C. [15]. Burnell, however, states that its use ended by the 4th cent. A.D.[16] It is from this script that the Telugu-Kannaḍa syllabary (called the Vēngī Cāḷukya script by Burnell but popularly known as Telugu-Kannaḍa 'box-heads') was derived.[17] There are three distinctive sub-types of it, of which, according to Buhler, (i) the *archaic* variety dates between c578 A.D. and 668 A. D. or earlier; (ii) the *middle* variety (called the *calukya* script by Burnell because it was found only in the copper-plate grants of the Eastern Cāḷukyan kings) ranges between c 650 A. D. and c 950 A.D.; and (iii) the third variety, called the *transitional* script by Burnell and *the old Telugu-Kannada* script by J. F. Fleet, dates between c1000 A.D. and 1300 A. D.[18] K. V. Lakshmana Rao corrects the last date for this type of script to 1200 A. D. but Buhler, however, considers that the transition can be noticed during the 8th, 9th and 10th centuries A. D.[19] It is generally believed that Telugu and Kannaḍa syllabaries got separated from the common script from 1300 A.D. but Al-Bīrūnī could notice the divergence from as early as 1030 A.D. [20]

In the present study, we come across the first two sub-types of the common script. The characters of the veṅgī cāḷukya

13. Ibid., pp.24-25, 33-34; I J. Gelb, SW, pp. 187 and 201.
14. Buhler, IP, p 34.
15. Ibid., pp. 47, 49 and esp. 57.
16. A. C. Burnell, ESIP, p. 12.
17. Ibid., p. 14; Buhler, IP, p. 81.
18. Buhler, pp. 81-87; Burnell, ESIP, p. 25.
19. Buhler, IP, p. 92; Āndhra Vijñāna Sarvasvamu 1.374, 377.
20. Burnell, ESIP, p. 25, f.n. 4. For some more details about the origin, growth and development of the Telugu Syllabary, see (i) G. J. Somayaji, ABV, pp. 257-260, (ii) C. Sivaramamurti. IESIS, pp. 42-54 and 150-154, (iii) K.V. Lakshmana Rao, 'Akṣaramulu', Āndhravijñāna Sarvasvamu, 1.334-397, (iv) M. Somasekhara Sarma, Vijñāna Sarvasvamu (Telugu Bhāṣā Samiti) 3.1056-1060, (v) V. Prabhakara Sastry, Telugu Merugulu, pp. 93-100, (vi) T. Ramachandra, Mana lipi puṭṭupūrvōttarālu, pp. 97-160 and several other books like 'Vaiyākaraṇa pārijātamu' by V. Ch. Sitaramaswamy. etc.

script, unlike those of other sub-types, were always engraved from bottom to top. The four inscriptions (A17,18,25 and 36) engraved in this variety are assigned to the 7th cent. A. D. The 11 inscriptions written in the archaic variety (A62-64,66-73) are assigned, to be conservative, to the 8th cent. A.D. All the Vaydumba inscriptions, stated in the Epigraphical reports as engraved in the archaic or ancient script (A92-94,98,100 and101), are assigned to the 9th/10th cent. A.D. Similarly, all the inscriptions stated to belong to the pre-Nannaya period (A116-118) are assigned to the 10th cent. A.D.

Mention of dates in numerals was first made in India in the Srikakulam grant of the 8th cent. A.D.[21] Word numerals came into vogue from 815 A.D.[22] In the corpus, every detail of the date except the year in Saka Era is first found in A 11 of 600-500 A.D. The year of the grant was first found in A 103 of 914 A.D., but the word denoting the Era was lost. The earliest occurrence of the date in an inscrption in the Saka Era was in A 111 of 972 A.D. The earliest use of plain words denoting numerals is noticed in A 119 of 1006 A.D. The earliest employment of word-symbols indicating the date of the grant is in A144 of 1075-76 A.D.

The manv wrong readings in texts are mainly due to similarities in graphs and also to the carelessness and spelling habits of the scribes or sculptors. The graphs for /th/ and /nr̲/ are almost similar. The dot and horizontal bar are always not clearly seen engraved. Signs for /ḷ/ and /ḍ/ are nearly the same upto 1200 A.D.[23] Also /d/ and /ḍ/,/l̲/ and /r̲/, and for some time /nr̲,l̲, and r̲/ were represented by graphs almost similar to each other. No orthographic distinction was made between /e/ and /ē/, and /o/ and /ō/ until the 17th cent. A.D.[24] In many cases, the length of a vowel was generally left unmarked, except in the case of /ī/ and /ū/[25]. But a study of the corpus shows that even in the case of /ī/ and /ū/, the situation is far from being clear. The representation of double consonants by single

21. Bühler, IP, p. 105.
22. Ibid., p. 106.
23. Burnell, ESIP, p. 28.
24. K. Lakshmana Rao, Andhra Vijñāna Sarvasvamu, 1.378; T.Ramachandra, MLPP, pp. 131, 132 and 135; A. C. Burnell, ESIP, p. 30.
25. Bühler, IP, p. 48; T. Ramachandra, Op. cit.

ones and omission of non-aspirates before aspirates are also common.[26] *Anusvāra* is said to have been employed to indicate gemination of a consonant. Gemination of a stop following *anusvāra* or a flap, though not universal, is a very common practice[27]. Added to these, is the speciality of the sign for *anusvāra* [o]. Epigraphists believed that an inscription can be dated on the basis of the location of the graph for *anusvāra* in a given grant. Burnell offers a detailed explanation regarding the location and quality of *anusvāra*. The 'bindu' [o] was always engraved *above* the line in cēra grants; it was *on* the line in cāḷukya grants.[28] The sign for *anusvāra* was originally a dot [.] and a superscript on the right or left of the following syllable. It gradually developed into 'zero' and was written above the line on the right side at the time of Nannaya. In the post-Nannaya period or sometimes even in grants contemporaneous to him, it was written alongside of the following and the preceding syllables. Its notation was generally neglected in writing right from the Prākrt records of the 2nd cent. A.D.[29] It may be useful to quote here the remarks of J.Ph. Vögel on the situation. He says : "The sign for anusvāra too has often been omitted, while in several cases it is difficult to decide whether what appears to be a dot over the akṣara may not be a depression in the surface of the stone due to accident........."[30]. The same holds good in the case of Telugu inscriptions also. The situation becomes more complicated since it was used as a cover-symbol for homorganic nasals.

The four symbols for /ḻ,ḷ,ṟ and nṟ/ occur in the corpus from a very early date. The symbol for /ḻ/ occurs in B 13 of 506 A. D. at the earliest.[31] The symbol for /ḷ/ first occurs in B9 of 426 A.D. but in a word of doubtful etymology. Its earliest clear occurrence is noticed in B13 of 506 A.D. The symbol for /ṟ/ first appears in B8 of 395–410 A. D. in a place-name 'aṟutoṟe'. The graph for /nṟ/ first occurs in B12 of the 5th cent.

26. Bühler, op. cit.
27. Regarding gemination of a stop : MLPP, pp. 138-140; re: that of a consonant following /r/ : G. S. Gai, HGOK, p. 12, f.n. 31.
28. ESIP, p. 30, MLPP, pp. 137-142; IP, pp. 48 and 88.
29. Op. cit.
30. Vögel as quoted by M. A. Mehendale, HGIP, p. 107.
31. C. Sivaramamurti, IESIS, p. 151; MLPP, p. 104; M. Somasekhara Sarma, Vijñāna Sarvasvamu, 3.1057.

A. D.[32] This was subjected to various kinds of interpretations and was given various values by different scholars at different times. The one peculiarity of the graph is that it almost always occurred in conjuction with the symbol for /n/ and as the second member of the cluster /nṟ/. It is only in one recent find that it occurred along with the graph for /ṉ/.[33]

The primary and secondary forms of the symbols for [ḷ, ḹ, and ṝ], the primary forms of the signs for [ai and au] and the graph for [jñ] do not occur in the corpus.

Gemination of consonants following the rēpha [r] is an orthographic practice borrowed from Sanskrit. Native words are also written in this manner from the 7th cent. A.D., just like loans. This practice was in descending frequency in the case of unassimilated loans from the begining of the 11th cent. A. D. but became almost accomplished in the case of native element from that time. Geminating a stop following the *anusvāra* is an orthographic practice developed in Telugu from 9th/10th cent. A. D. The number of instances in the material in which a stop was geminated following *anusvāra* are only 36 as against the 347 instances of non-gemination. This means that the practice in question was far from being accomplished by 1100 A. D.

I have not given to social and political histories the importance I gave here to the history of the language. But at the foot of the inscriptional texts references to various historical evidences leading to dating them and different arguments of various scholars are supplied alongside of different text versions. Keeping in view the needs of scholars who know only Telugu or English, the texts are given in both the scripts. But to save space, text versions are supplied only in the Roman script. After providing the texts of inscriptions series-wise and in chronological order, a concordance of the inscriptional glossary is given in both Telugu and English. But the grammatical descriptions of the items, their cognates and etymologies with reconstructed forms are supplied only in Roman script and English so as to avoid difficulties in printing and to save space. I have been selective while supplying cognate words

32. K. Ramakrishnaiah, JVOI, 12.18-20;110-111.
33. See the text of A 58.

and references to the discussions of scholars so as to reduce the bulk of the book, the details of which can be gathered from such source books like the 'Dravidian Etymological Dictionary' and others cited extensively as and when necessary. The important features and aspects which are accountable from a study of the language of the inscriptions are supplied in the following pages in both Telugu and English, separately. The brief essays are highly abridgad forms of a historical grammar of Early inscriptional Telugu written by the undersigned. They contain the major conclusions in my doctoral dissertation.

I respectfully dedicate this work to the Late Mallampalli Somasekhara Sarma, the doyen of Andhra historians and paleographists whose affection and unstinted help in the collection of material and in resolving the text versions are priceless. May God rest his soul in peace.

I am grateful to all those who helped me in collecting the material. I am indebted to the Late M. Venkataramaiah and K. Harshavardhana Sarma and to Dr. D. C. Sircar and Sri H.K. Narasimha Swamy. I am grateful to the Government of India for the scholarship given to me covering a portion of my research period and to Sarva Sri A. Ramakrishna Rao and A. Srinivasa Rao Pantulu for the library facilities extended to me. I can not forget Professors G. J. Somayaji, Bh. Krishnamurti, N. Venkata Rao and T. Mahalingam for the help I received from them while researching. I thank the authorities of the Andhra University for admitting me to research course and those of V. R. S. & Y. R. N. College, Chirala, for giving me leave facilities.

Research without prospects of publication is useless. I am very grateful to the Executive Board of the A. P. Sahitya Akademi and especially to its Secretary, Sri D. Ramanuja Rao for having agreed to publish the work in recognition of my labours in the field.

Printing in two languages and scripts with mny diacritics is a difficult job. This can be appreciated by those who know the general standards of printing in our country. In this light, I pay compliments to Messrs B.V.R. Balreddy & Co., Secunderabad, for the neat execution of the work.

B. RADHAKRISHNA

# ఉపయుక్తరచనలు ( BIBLIOGRAPHY )


Adharvaṇāchārya, Vikṛti Vivēkamu (or Adharvaṇakārikāvaḷi) with "Kavijanamaṇḍana" commentory by Dvitintriṇī Sītārāmakavi and review by V.Ch. Sitaramaswami Sastry, V. Ramaswamy Sastry and Sons., Madras, 1955 (2nd edn.).

Allen, W.S., Phonetics in Ancient India, London, 1953.

Anantāmātya, Anantacchandamu (or Chandōdarpaṇamu), V. Ramaswami Sastry and Sons, Madras, 1947 (2nd edn.),

Anavaratavinayakam Pillai, S., "Dravidic Studies III: The Sanskri Element in the Vocabularies of the Dravidian Languages," Government Press, Madras, 1923.

Anjaneya Sastry, K., "Anunāsika prāsamu: Appakavīyamu", Bh. 19.541-544.

Appakavi, K., Appakavīyamu, V. Ramaswami Sastry and Sons, Madras, 1951.

Avadhani. D.V., "Telūgun andali Vṛttagandhi Gadyamulu." ASPP 44.211-223.

——, "Gāthāsaptaśati lōni Telūgu Padamulu", ASPP 43.35-48.

——, "Prāṇnannayu Yugamu, Hyderabad, 1960.

——, and Ramakrishna Rao, A., Nannaya Pada Prayōga Kōśamu, APSA, Hyderabad, 1960,

Bhaduri, M. B., A Mundari-English Dictionary, Calcutta University Press, Calcutta. 1931.

Bhattacharya, S., "Koṇḍa Language (Grammar and Vocabulary)". Reprint from the Bulletin of the Department of Anthropology, Government of India, Indian Museum, Calcutta (Part I, pp. 217-248).

——, The Parji Language: A Dravidian Language of Bastar, Stephen Austin and Sons Ltd., Hertford, 1953.

Biligiri, H.S., "The Nasal Phonemes of Kannaḍa", IL 16. 306-308.

Bloch, Jules, "The Intervocalic Consonants in Tamil", translated by J. D. Anderson, IA (1919), pp. 191-195.

_____, "Some Problems of Indo-Aryan Philology", BSOS 5.720-756.

_____, The Grammatical structure of Dravidian Languages, translated by R. G. Harshe, Deccan Gollege, Poona, 1954.

Bloomfield, Leonard, Language, George Allen and Unwin Ltd., London, 1955.

Brown, C. P., A Telugu-English Dictionary, Second edition, revised by M. Venkataratnam, W. H. Cambell, and K. Veeresalingam pantulu, Society for Promoting Christian Knowledge, Madras, 1930.

Bühler, George, Indian Paleography, Indian Studies: Past and Present, Calcutta (?1959).

_____, On the Origin of Indian Brāhma Alphabet (2nd edn., revised), Indian Studies No. 3., Strassburg, 1898.

Burgess and Natesa Sastry, S. M., Tamil and Sanskrit Inscriptions.

Burnell, A. C., Elements of South-Indian Paleography, second edition, enlarged and improved, London, 1878.

Burrow, T., "Dravidian Studies I", BSOAS 9.711-722

_____, ,, ,, II", BSOAS 10.289-297

_____, ,, ,, III", BSOAS 11.122-139

_____, ,, ,, IV", BSOAS 11.328-356

_____, ,, ,, V", BSOAS 11.595-616

_____, ,, ,, VI", BSOAS 12.132-147

_____, ,, ,, VII", BSOAS 12.365-396

_____, "Some Dravidian Words in Sanskrit", TPS (1945), pp. 79-120.

_____, Some Loan Words in Sanskrit", TPS (1946), pp.1-30

_____, and Bhattacharya, S., The Parji Language, A Dravidian Language of Bastar, Stephen Austin and Sons, Ltd., Hertford, 1953.

_____, and Emeneau, M.B., A Dravidian Etymological Dictionary, Clarendon Press, Oxford, 1961.

అడ్డ, అద వంటి ప్రాకృతసమాలతో, అర్ధ వంటి సంస్కృతసమాలతో సూచించేవారు.

విశేషణాలు అనేకవిధాలు. (1) విశేష్యాలకు ముందుమాత్రమే వచ్చే అస్వతంత్ర ప్రాథమిక విశేషణాలు ఒకరకం. ఆ-, ఈ-, ఏ-, అనే త్రికం ఇదే. త్రిక సంధి క్రీ. శ. 7-11 శతాబ్దుల మధ్య వైకల్పికంగానే ఉండేది. త్రికంమీది హల్లు ద్విరుక్త మైనప్పుడు త్రికదీర్ఘస్వరం వికల్పంగా హ్రస్వమయ్యేది. సంయుక్తహల్లుల్లోని ప్రథమహల్లు కూడా ద్విరుక్తమవుతుండేది. త్రికంమీది అజాదిశబ్దాలకు యడాగమం వచ్చేది. ఉదా. ఆ-బసిఙ్డి : అ-ఋ్వార ణాసి; ఈ-ఊఙ్లందు : ఇ-ప్రతిమ, ఇ-య్యొట్టు; ఎ-వ్వర్. (2) విశేషణంగా వాడుక చేసే ద్వితీయాదివిభక్త్యంగం రెండో రకం. (3) సంఖ్యావాచక విశేషణాలు మూడోరకం. (4) '-ఎణ్డు/-ఎడు' అనే మానార్థక ప్రత్యయం చేరిన విశేషణాలు నాలుగో రకం. ఉదా. మూన్-ఎణ్డు, మూన్-ఎడు. (5) విశేష్యంమీది -ము ప్రత్యయస్థానంలో వినిమాయకపదాంశమైన -పు వర్ణకం చేరిన విశేషణం అయిదో రకం. ఉదా. వేం-బళ్ళి : వేప్-ఊర్. ఇవి బహువిరళంగా ఉండేవి. (6) అజంతవిశేష్యం మీది అజాది విశేష్యానికి టుగాగమం చేర్చి విశేషణం చేసింది ఆరో రకం. ఉదా. ఇరుకు-ట్-ఊరు. (7) విశేష్యవిశేషణలక్షణాలు రెండూ ఉన్నవి ఏడోరకం ఉదా. ఉరువు-పల్లి. (8) కేవలం విశేషణాలుగా మాత్రమే ప్రయుక్తమయ్యేవి ఎనిమిదోరకం. ఉదా. చిట్ట్-ఏరు, చిఱు-ంబూరి, చెఙ్-చెరువ్. (9) క్రియా పదాలుగా కూడా ఉండే ధాతుజవిశేషణాలు తొమ్మిదోరకం. ఉదా. ఇచ్చిన, ఉన్న, ఉపేక్షించిన, మన్న, రక్షిఞ్చిన, అచ్చిన, మొదలైన భూతకాలికవిశేషణాలూ, మను-వాణ్డు, అయ్-ఏ, వండ్-ఎడి, వక్రంబు రాదెంచు-(వేవుర), మొదలైన తద్ధర్మార్థక విశేషణాలూ, పెటని, లేని వంటి వ్యతిరేకార్థక విశేషణాలూ శాసనాల్లోదొరుకుతున్నాయి. (10) ఇవిగాక నామవాచకం మీద 'అగు' ధాతు భూతకాలిక విశేషణరూపం 'అయిన' చేర్చి నిర్మించిన విశేషణపూర్వపద పదబంధాలు కొన్ని విరళంగా కనిపిస్తాయి. ఉదా. ఉత్తమోత్తముణ్డ్-అయిన. శాసనస్థ నిదర్శనాలనుబట్టి ఈపదబంధనిర్మాణం క్రీ.శ. 7వ శతాబ్దిలో కడప మండలంలో ఆరంభమై, 8-10 శతాబ్దాల మధ్యకాలంలో దక్షిణకోస్తాకు వ్యాపించి, 11 వ శతాబ్దికి యావదాంధ్రదేశంలో వాడుకలోకి వచ్చింది.

మూడురకాల అవ్యయాలు శాసనాల్లో కనిపిస్తున్నాయి. (1)విశేష్య

ప్రాతిపదికకు 'కా' అనే అసంపూర్ణక్రియారూపాలు చేరి ఏర్పడ్డవి. ఇవి అసంఖ్యాకాలు (2) సర్వనామాలుగా భావించబడేవి. ఉదా. ఇఱ (=ఇట్ల), అట్లు, ఏమి, ఏవ్(=ఏం). (3) అవ్యయప్రయోగంగల స్వతంత్రశబ్దాలు. ఉదా. అర్థిన్, తొల్లి, నెగి, పరువడి, పిదప, పోలె, మఱి, మిణ్ణక. వీటిలో చివరిది 'మిణ్ణు' అనే క్రియకు వ్యతిరేకార్థక విశేషణరూపం.

సామాన్య, సంకీర్ణ, సమస్తక్రియలని క్రియలు మూడు విధాలు ఏక ధాతుకమైన 'అగు' వంటివి సామాన్యక్రియలు. ఇవన్నీ దేశ్యాలే నామ ప్రాతిపదిక మీద క్రియాకారక ప్రత్యయం చేరి ఏర్పడ్డవి సంకీర్ణక్రియలు. ఇవి దేశ్యాల్లో, ఎరువుమాటల్లోనూ ఉన్నాయి. ఉదా. (i) దేశ్యాల్లో:కట్ట్-ఇఞ్చ్-, ముట్చ్-ఇల్-; (ii) ఎరువుమాటల్లో : అనుభవ్-ఇంచు, ప్రసత్ర్-ఇల్ల్-, సమస్తక్రియ లన్నీ దేశ్యాలే ఇవి రెండు రకాలు. (1) క్రియాప్రాతి పదికమీద మరోక్రియాపదాంశం చేరి ప్రత్యేకార్థా లిచ్చేవి. ఉదా. (i) వర్త మానార్థకం : ఏలుచ్-ఉన్ని; (ii) భవిష్యదర్థకం : నడవం-గల; (iii) ఆత్మా ర్థకం : అటిసి-కొన్న; (iv) అనుజ్ఞార్థకం : మణం-జనదు; (v) ఆధిక్యార్థకం: రా-దెంచు; (vi) కర్మణ్యర్థకం : కట్ట-బడిన; (vii) నిశ్చయార్థకం: రక్షి మ్పను-వలయున్. (2) అస్వతంత్రనామధాతువు మీద అనుబంధక్రియ చేరి ఏర్పడ్డని ఉదా చే-కొని. ఈ సమస్తక్రియలు క్రీ శ. 8వ శతాబ్దంనుంచీ విరళంగా దొరుకుతున్నాయి.

అకర్మకక్రియాధాతువు మీద '-చు' ప్రత్యయంగాని, '-ఇంచు'ప్రత్య యంగాని చేరి సకర్మకక్రియలు ఏర్పడేవి. అకర్మకధాత్వంతంలోని '-చు' సకర్మకక్రియగా మారేటప్పుడు '-పు'గా మారుతుంది. ఉదా. (i) అ. క్రి. ధా +-చు: చెఱి-చిన. ఈమార్పు జరిగేటప్పుడు ధాతుగతడకారం అకా రంగా మారేది. ఇది క్రీ. శ. 9వ శతాబ్దినుంచీ కనిపిస్తున్నది (ii) అ. క్రి. ధా. +-ఇన్చు; రా-వ్-ఇంచి (iii) అ. క్రి. ధా -చు>-పు: చమ్-వ్-ఇన. ఈమార్పు జరిగేటప్పుడు ధాతుగత చకారానికి అనునాసికవర్ణం ఆదేశమవు తుంది

ప్రేరణార్థకక్రియలు రెండు విధాలుగా ఏర్పడేవి. (1) సకర్మక ధాతువుకు '-ఇంచు' ప్రత్యయం చేరుతుంది. ఉదా. కట్ట్-ఇఞ్చ్-ఇ, కావ్--ఇఞ్చ్-ఇ (2) సకర్మకధాతుగత చకారానికి పకారం ఆదేశమవుతుంది. ఉదా. కుడి-వ్-ఇన, పంపు. ఈమార్పులు జరిగేటప్పుడు ధాతుగతచకారా

నికి నకారాదేశమో (ఉదా. చొచ్-చు>చొన్-పు), ధాతుగతనకారానికి మకారం ఆదేశం కావటమో (ఉదా. పన్-చు>పమ్-పు), జరిగేవి.

క్రియాప్రాతిపదికల స్వరూపాల్లో కాలార్థకప్రత్యయాలు చేరినప్పుడు కొన్ని మార్పులు వచ్చేవి. ఇవి పదమధ్యసంధులే గాని ప్రాతిపదికల పర్యాయరూపతను ఒకేచోట నిరూపించటంలోని లాఘవాన్ని పురస్కరించుకొని ఇక్కడ చర్చించటం జరుగుతున్నది. ఈమార్పుల్లో ఎనిమిది ప్రధానమైనవి. (1) భూతకాలిక ప్రత్యయాలైన 'ఇ, ఎ'లుగాని, చేదర్థకప్రత్యయగతమైన ఇకారంగాని చేరినప్పుడు ధాతుగతయకారం సకారంగా మారేది. ఉదా. కేస్-ఇ, అటిస్-ఇన, కేస్-ఇరి, వ్రాస్-ఎ, చేస్-ఇనారు. (2) ప్రత్యయాదినున్న 'ఇ,ఎ'లముందు ధాతుగతమైన ఉకారం ఇకారంగాను, ఇకారం అకారంగాను, బహుళంగా మారేవి ఉదా. (i) ఉ > ఇ: కుడివ్ - ఇన, పొడిచ్-ఇ, ఉడిచ్-ఎ, చెఱిచ్-ఇనను ఈ మార్పులు జరగని రూపాలు లేకపోలేదు. ఉదా. పొడుచ్-ఇ, పొడుచ్చ్-ఇ. (ii) ఇ > అ: కొలచ్-ఇ, నడవ్-ఇన, కదవ్-ఇనను. (3) ఊనికలేని ద్వితీయాక్షరగతాచ్చులు చ్యుతం కావటమో లోపించటమో జరిగేది. ఉదా. నిల్ప్-ఇ, నిల్ప్-ఎ; పల్క్-ఇన, నిల్ప్-ఇరి, నిల్ప్ - ఇనం. (4) ప్రత్యయాదినున్న 'ఇ, ఎ'ల ముందుగల ధాతు గతవకారం యకారంగా మారేది. ఉదా. పో - యె/పోయ్-ఎ, పోయ్ - ఇన. (5) తుమర్థకప్రత్యయం చేరినప్పుడు ధాతుగత చకారం వకారంగామారేది. ఉదా. కావ్-అన్. (6) తుమర్థక ప్రార్థనాద్యర్థక ప్రత్యయాలు చేరినప్పుడు ధాతుగతమైన అద్విరుక్తహల్లుకు ముందున్నఅచ్చు దీర్ఘంగాను, ద్విరుక్తహల్లుకు ముందున్న అచ్చు హ్రస్వంగాను, పర్యాయరూపత పొందేవి. ఉదా. కొ-φ-మ్మ, పో-φ-మ్, పొయ్య్-అ. (7) 'ఇచ్చు' ధాతు తుమర్థకరూపం ఈయ్-అన్‌గా ప్రత్యయాచ్చుకు ముందు యడాగమం జరిగినరూపంలో క్రీ.శ. 9/10 శతాబ్దిలో కనిపిస్తుంది. (8) ప్రత్యయాచ్చుకు ముందు యడాగమం జరిగినరూపంలో క్రీ.శ. 9/10 శతాబ్దిలో కనిపిస్తుంది. (8) ప్రత్యయాద్యచ్చు లోపించటంవల్ల వర్ణసమీకరణం జరిగి ప్రాతిపదికస్వరూపంలో మార్పువచ్చేది. ఇది రెండురకాలు. (i) పురోగామి సమీకరణంవల్ల మారినది. ఉదా. మన్-న; (ii) తిరోగామిసమీకరణంవల్ల మారినది. ఉదా. ఇడ్డ్-అ, ఉన్న్-అ, కొణ్న్-అ.

భూతకాలికసమాపకక్రియలకు చేరే ప్రత్యయాలు ముఖ్యంగా రెండు వర్గాలవి. 'ఇ,ఇతి,ఇన్,φ' అనే సపదాంశాలు మొదటివర్గానికి చెందినవి.

వీటిలో మొదటి రెండూ హలాదిపురుషప్రత్యయాలకు ముందువస్తే మూడోది అజాదిపురుషప్రత్యయాలకు ముందు వచ్చేది. నాలుగోది ధాత్వంతయకారానికి పురుషప్రత్యయానికీ మధ్యమాత్రమే వచ్చేది. ఉదా. -ఇ-: ఇచ్చ్-ఇ-రి; -ఇతి-:ఇచ్చ్-ఇతి-రి, ఇచ్చ్-ఇతి-మి; -ఇన్-:ఇచ్చ్-ఇ-న్ అణ్డు; -φ-:ఐ-φ-రి. పై వాటిలో -ఇ- మధ్యమపురుష మహన్మహతీ బహువచనాలకు ముందు వచ్చేది. 'ఇయె(న్), ఎ(న్-ఉ)' అనేవి రెండోవర్గానికి చెందిన ప్రత్యయాలు. ఇవి ప్రథమపురుషైకవచనంలోను, ప్రథమపురుషలోని అమహద్బహువచనానికి ముందూ, వచ్చేవి. ఉదా. -ఇయె(న్)-: పడ్-ఇయె, పడ్-ఇయెన్; -ఎ-:నిల్ప్-ఎ, వ్రాస్-ఎ;-ఎన్-: నిల్ప్-ఎన్; -ఎం-: కట్టించ్-ఎం; -ఎను: కట్ట్-ఎను. '-ఎన్-' ప్రత్యయం బహుశా '-(అ)న్'అనే పురుషవాచకప్రత్యయంతో కలిసి ఏర్పడ్డ సంసక్తసపదాంశం కావచ్చు.

'-ఇన,-న' ప్రత్యయాలు క్తవదర్థంలో వచ్చే సపదాంశాలు. హలంత ధాతువులమీద సాధారణంగా నిలిచే ప్రత్యయగతమైన ఇకారం ధాతుగత యకారం తరవాత నిత్యంగా లోపించేది. ప్రత్యయాచ్చు లోపించిన సందర్భాల్లో వర్ణసమీకరణంవల్ల వచ్చేమార్పుల్ని ఇంతకుముందే గమనించాం. ఉదా. ఇచ్చ్-ఇన, అయ్-న, ఇడ్-డ.

క్త్వార్థంలో '-ఇ'ప్రత్యయం వచ్చేది. ధాతుగతయకారంమీద దానికి పాక్షికంగా లోపంవచ్చేది. ఉదా. అయ్-ఇ, అయ్-φ. క్రీ. శ. 8, 9 శతాబ్దుల్లో కనిపించే పొడిచ్చి, పొడుచ్చి అనేరూపాలు ఆధారంగా మూలద్రావిడ భూతకాలిక ప్రత్యయం '*-చి' అప్పటికింకా నిలిచివుందనే సందేహం కలుగుతుంది. '*పడియె, *పడె' అనే భావితరూపాల స్థానంలో పడి-చె వంటి రూపాలు శాసనాల్లో కనిపించినందువల్ల ఈసందేహం దృఢపడుతుంది. ఈరూపాలు రాయలసీమ దక్షిణప్రాంతాల్లోనే లభించటం మరో విశేషం.

తద్ధర్మార్థకసమాపకక్రియల నిర్మాణం రెండురకాలు:పురుషవాచకప్రత్యయాలున్నవీ, లేనివీ. పురుషప్రత్యయాలున్నవాటిలో 'తు-, -దు-,-డు-, -φ-'అనే సపదాంశాలు తద్ధర్మార్థకప్రత్యయాలుగా కనిపిస్తాయి. ధాత్వంత ణకారం మీద డాదిసపదాంశమూ నకారంమీద తాదిసపదాంశమూ వచ్చేవి. ధాత్వంతాచ్చు మీద దాదిసపదాంశమూ 'కల' అనే అసంపూర్ణ క్రియమీద శూన్యప్రత్యయమూ వచ్చేవి. ఉదా. కొణ్-డు-మ్ (నేటి 'కొందుము'కు పూర్వరూపం), కొణ్-డ్-ఋ, కాన్-తు-రు, ఉణ్డు-దు-రు, పో-దు-రు, పోవు-దు-రు, కల-φ-ర్, కల-φ-ణ్డు, కల-φ-ద్, కళా-φ-ట్. పురుష

ప్రత్యయరహితమైన తద్ధర్మార్థక సమాపక క్రియల్లో 'ఉ(న్)-' అనే అర్థక ప్రత్యయం కనిపిస్తుంది. ఉదా. అగ్-ఉ, అగ్-ఉన్, వలయ్-ఉం.

తద్ధర్మార్థక విశేషణప్రత్యయాలు రెండు విధాలు. (1) '-ఉ(న్)-, -Ø-' లతో ఉన్నవి. ఉదా. పంప్-ఉ, తెచ్చ్-ఉన్, అన్-Ø, కల-Ø. (2) '-ఎడి, -ఎడు, -ఏ, -ఏట్టి' లతో ఉన్నవి. ఉదా. వణ్డ్-ఎడి, ఏళ్-ఎడు, అ-ఏ (అయ్యే-అనటానికి బదులు తప్పుగా), అన్-ఏట్టి (అనేటి-అనటానికి బదులు తప్పుగా). చివరి రెండూ అర్వాచీనాలే గాని నన్నయ నాటికే అవి రాత కెక్కేయి.

నడపునది అనే విధ్యర్థకరూపం ఒక్కచోటే లభించింది. ఇది ధాతుజ విశేషణంగా, విశేష్యపూర్వస్థానంలో విశేషణంగా, క్రియాపదంగా మూడు విధాల భాసిస్తుంది. నిర్మాణక్రమాన్ని బట్టి పురుషప్రత్యయ సహిత తద్ధర్మార్థక సమాపక క్రియగా దీన్ని పరిగణించవచ్చు. కాని ఆ క్రియారూపానికి దీనికిలాగా విధ్యర్థం లేదు. '-అది'ని నిర్దేశ సర్వనామ ప్రత్యయమని భావిస్తే దీనికి పురుషబోధకత్వం లేదు. ప్రథమ మధ్యమ పురుషల రెండు వచనాల్లోనూ ఇది ఒకే రూపంలో ఉంటుంది కాని ఉత్తమ పురుష రెండు వచనాల్లోనూ దీనికి విధ్యర్థకప్రయోగం లేదు. దీని నిర్మాణ సంక్లిష్టతను ఏదో ఒక విధంలో వర్ణించటం సరికాదు.

'-ఇనన్, -నను' అనేవి చేదాద్యర్థక ప్రత్యయాలు. '-నను'లోని చివరి ఉకారం అపదాంశమనవచ్చు. ధాత్వంత యకారంమీద ప్రత్యయాదీకారం లోపిస్తుంది. ప్రత్యయాద్యచ్చు లోపించినప్పుడు కొన్నిసమయాల్లో వర్ణసమీకరణం జరుగుతుంది, పదమధ్యసంధిలో. ఉదా. కట్ట్-ఇనన్, నిల్ప్-ఇనం, కొణ్-ణన్, అయ్-నన్-ఉం.

ప్రార్థనాద్యర్థక క్రియారూపం ప్రాతిపదికా పురుషప్రత్యయాల మధ్య ప్రత్యయమేదీ చేరకుండానే ఏర్పడుతుంది. అప్పుడు ధాతుగత దీర్ఘాచ్చుమీద అద్విరుక్త హల్లుగాని, హ్రస్వాచ్చుమీద ద్విరుక్తహల్లుగాని నిత్యంగా వస్తాయి. ఉదా. కొ-Ø-మ్మ, మను-Ø-ము, పో-Ø-మ్.

తుమర్థంలో ధాతువుమీద '-అన్, -అంగ' మొదలైన సపదాంశాలు చేరుతాయి: '-గ' అన్నది 'కా' అనే అసంపూర్ణ క్రియారూపమే. ఇది చేరినా చేరకపోయినా అర్థభేదంగాని అర్థలోపంగాని కలగవు. అంటే ఇది అంశాభాస మన్నమాట. ఉదా. ఏళ్-అన్, ప్రవర్తిన్ల్-అ, చేయ్-అ, ఒవ్ప్-అంగ, అల్లియ్-అం, నా-ం. చివరిపదం 'అనం' అనే రూపంలో వర్ణవ్యత్యయం

వచ్చి ఏర్పడ్డది. ప్రాతిపదికాంత దీర్ఘాచ్చుమీద ప్రత్యయాద్యచ్చు లోపి స్తుంది.

శత్రర్థంలో ధాతువుమీద '-చు' ప్రత్యయం చేరుతుంది. ఉదా. ఏలు-చు, అనుభవించు-చు. ఈ క్రియారూపానికి 'ఉండు' ధాతురూపాలను అను బంధించి వర్తమానక్రియలు నిర్మించేవారు. వృత్తవర్తిష్యమాణ క్రియారూపాలు డొంకతిరుగుడుగానే నిర్మితమైనాయి.

తద్ధర్మార్థకసమాపకక్రియకు వ్యతిరేకరూపాన్ని ధాతువుకు'-(అ)దు' అనే ప్రత్యయాన్ని చేర్చి నిర్మించేవారు. ప్రత్యయాద్యచ్చు హలంతధాతువుల మీద నిలిచి అజంతధాతువులమీద నిత్యంగా లోపించేది. ఉదా. చన్-అదు, లే-దు. వ్యతిరేకార్థక విశేషణాలు ధాతువుకు '-(అ)ని' ప్రత్యయం చేరి ఏర్పడేవి. ఉదా. పెట్-అని (పెట్టని-కి బదులు తప్పుగా), లే-ని. వ్యతిరేక క్త్వార్థకక్రియలు ధాతువుకు '-(అ)క' ప్రత్యయంచేరి ఏర్పడేవి. ఉదా. ఈ-క, చేయ్-అక్, ఓప్-అక, కా-క్, లే-క్. పై మూడు రకాల వ్యతిరేకార్థక క్రియల్లోనూ ప్రత్యయాద్యచ్చు హలంతధాతువులమీద నిలిచి అజంత ధాతువుల మీద నిత్యంగా లోపించటం సపదాంశాల పరిపూరక ప్రవృత్తికి చిహ్నమేగాని ప్రత్యయాద్యచ్చు వ్యతిరేకార్థకం కాదని నిరూపించదు. కానీ సంప్రదాయ వ్యాకరణాలు దాని ప్రాధాన్యాన్ని గుర్తించలేదు [30].

శత్రర్థకాసమాపకక్రియలకు 'ఉండు'ధాతురూపాలుచేర్చి వర్తమాన క్రియలు నిర్మించేవారు. ఉదా. ఏలుచ్-ఉన్ని, ఏలుచ్-ఉణ్డి, చేయుచ్-ఉన్న, ఇచ్చుచ్-ఉణ్డ, వాద్ధిణలుచున్-ఉణ్డు (వర్ధిలుచుణ్డు-కు బదులుతప్పుగా).

భవిష్యత్క్రియలను ధాతువు తుమర్థకరూపానికి అసంపూర్ణక్రియ 'కల'ను చేర్చి డొంకతిరుగుడుగా నిర్మించేవారు. ధాత్వంతద్రుతంమీద 'కల' నిత్యంగా 'గల'గా మారేది. ఉదా. ఓయం-గల, పొయ్య-గల, ప్రతిపాలింపం-గల. ఈ రకం భవిష్యత్క్రియలు క్రీ.శ. 11వ శతాబ్దివే దొరుకుతున్నాయి. 'కల' స్వతంత్ర క్రియగా కూడా శాసనాల్లో కనిపిస్తుంది ఉదా. కల-యంతకు.

ఉత్తమపురుషైకవచన క్రియారూపాలు దొరకలేదు. బహువచన రూపాలు '-మి/-ము' అనే సపదాంశాలతో లభ్యవడ్డాయి. ఉదా. ఇచ్చితి-మి, కొణ్డు-మ్,పరిహరించ్చితి-మి. ప్రాతిపదికాంశాచ్చు ఇవర్ణమైతే '-మి', ఉవర్ణమైతే '-ము' పరిపూరకప్రవృత్తిలో ఉంటాయి.

---

30. చిన్నయసూరి, బాలవ్యాకరణము, 8, 32, 37, 39, 47, ముఖ్యంగా 20.

మధ్యమపురుషైకవచనప్రత్యయం ప్రార్థనాద్యర్థకాల్లో మాత్రమే లభించింది. ఉదా. కొమ్-మ్, పో-మ్. బహువచనరూపం ఒక్కటే దొరికింది. ఉదా. ఇచ్చితి-రి.

ప్రథమపురుషలో లింగభేదంమీద ఆధారపడి భిన్నప్రత్యయాలు కనిపిస్తాయి. పురుషబోధకప్రత్యయాలు ఏకవచనంలో మహదమహద్భేదంతోనూ, బహువచనంలో ప్రాణివాచక-అప్రాణివాచక భేదంతోనూ దొరుకుతున్నాయి. విశేష్యాల్లో కనిపించే ఈ అన్వయం క్రియల్లో కూడా కనిపిస్తుంది. మహదేకవచన ప్రత్యయమైన సపదాంశం '-(అ)ణ్డు'. ఉదా. కల-ణ్డు, ఇచ్చిన్-అణ్డు. 'ఇచ్చినవాణ్డు' నుంచి ఏర్పడ్డ ఈ రెండోరూపం క్రీ. శ. 11వ శతాబ్దిలో గోదావరీమండలంలో మొదలైనా 13వ శతాబ్దినుంచి మాత్రమే దీనికి కావ్యప్రయోగగౌరవం వచ్చింది. అమహదేక వచనంలో '-అది,-అదు, -దు' అనే సపదాంశాలున్నాయి. ఉదా. ఇచ్చిన్-అది, చన్-అదు, లే-దు, కల-యది. ఇకారయుత సపదాంశం తద్ధర్మవిశేషణాల్లోను, ఉకారయుతం వ్యతిరేకక్రియల్లోను పరిపూరకప్రవృత్తిలో ఉన్నాయి. అజంత ప్రాతిపదిక మీద ప్రత్యయాద్యచ్చు నిత్యంగా లోపిస్తుంది. ప్రాతిపదికాంతాచ్చు తరవాత యడాగమం రావటంకూడా కద్దు.

మహన్మహతీ బహువచనంలోని పురుషప్రత్యయాలు పరిపూరక ప్రవృత్తిలో ఉన్నాయి: ప్రాతిపదిక చివరి ఇకారం తరవాత '-రి', ఇతరత్రా '-రు'. ఉదా. కేసి-రి, కొణ్డ్-ఋ, తాగి-రి, కల-ర్, పో(వు)దు-రు. '-ఋ' సంధివశాన ఏర్పడ్డది. అప్రాణివాచక బహువచనరూపం ఒక్కటి మాత్రమే (11వ శతాబ్దిలో) దొరికింది. ఉదా. ఇచ్చిన-వి.

ఏవార్థకంగా '-అ' ప్రత్యయం వచ్చేది. ఉదా పాఱక్-అ, చిర్పలి-య. అజంతప్రాతిపదిక మీద యడాగమం రావటం గమనించాలి. ఈ ప్రత్యయాన్ని పునరుక్తంగా ప్రయోగించటం కూడా విరళంగా ఉంది. ఉదా. తాన్-అ-య. ఈ లక్షణం కావ్యభాషలోనే నిలిచిపోయింది.

అనిశ్చయ, పర్యాయ, సందేహార్థాలను సూచించే ప్రత్యయ మొకటి '(య్)ఏని(యు/న్)' అనే భిన్నరూపాల్లో కనిపిస్తుంది. ఉదా. కలర్-ఏనియు, ఎవ్వి-యేనిన్, ఎవ్వాండ్-ఏని, 'ఏని' ద్రుతమా కళా అనే విషయం మీద తీవ్రచర్చలు జరిగాయి[31]. క్రీ. శ. 9/10 శతాబ్దినాటి కొరవి

31. బాలవ్యాకరణము, 2. 9; 3.41, 119; ఆంధ్రభాషావికాసము (1948), పే.307, 491, 552-554.

శాసనంలో రెండు రూపాలూ కనిపిస్తున్నాయి. అనుచిత విభాగంవల్ల 'నేని' అనే రూపం ఏర్పడ్డా అదే ప్రాచీనరూపమని పండితులు ప్రయోగాలను సంస్కరించారు[32]. 'నేని' అని వ్యాకరించదగ్గ సందర్భమేదీ శాసనాల్లో తటస్థపడలేదు.

సముచ్చయార్థక పదాంశం శాసనభాషలో విశేష్యాలమీద, క్రియల మీద, సందేహార్థక ప్రత్యయం మీద, సముచ్చయార్థాన్నే ఇచ్చే అవ్యయాల మీద కూడా బహురూపాల్లో వస్తుంది. ఉదా. (i) విశేష్యాలమీద: అన్ని-యు, కళాకణ్ఱుగ్‌_ఉమ్, గుళ్ళు-వు, వాలు_ను, కోటి_యి, గుడి_యిని, గావుండా-ను, దేవొనొజ్జలక్‌_ఊ, నవి-యునుం, ఎప్పుడ్‌-ఊను, గుడి_యింని; (ii) క్రియలమీద: ఐ-యుము; (iii) సందేహార్థకం మీద: కలరేని-యు; (iv) అవ్యయాల మీద: మఱి_యు, మఱి-యును. వీటిలో '-ఉము' అనే సపదాంశం ప్రాచీనతమం. ఇది క్రీ. శ. 7వ శతాబ్దిలో '_ఉను'గా పరిణమించటం ఆరంభమయింది. క్రీ. శ. 7, 8, 9 శతాబ్దుల్లో మాత్రమే దీనికి మాండలికంగా '-ఉవు' అనే రూపాంతరం ఉండేది. హలంతపదాల మీద క్రీ. శ. 7_11 శతాబ్దుల మధ్య ప్రత్యయగతమైన '-ను,-ము' అనే భాగాలు వైకల్పికంగా లోపించేవి. అదే కాలంలో అజంత పదాలమీద ఈ ప్రత్యయానికి ముందు యడాగమం వస్తుండేది. దీర్ఘాచ్చుగల '_ఊ,-ఊను' అనే 10,11 శతాబ్దాలనాటి సపదాంశాలు నేటి రూపాలకు మూలాలు. '_యి' అనే సపదాంశం క్రీ. శ. 9/10వ శతాబ్దినుంచి 11వ శతాబ్ది వరకూ తీరాంధ్రంలో మాండలికంగా వాడుకలో ఉండేది. '-యింని' అనేది క్రీ. శ. 18వ శతాబ్ది వ్యవహారంలోని '-ఇన్ని'కి పూర్వరూపం.

నిష్పాదకప్రత్యయాలు రెండు రకాలు: కృత్ప్రత్యయాలు, తద్ధిత ప్రత్యయాలు, అని. శాసనభాషనుంచి చెరి ఏడు ప్రత్యయాలను వ్యాకరించవచ్చు. తద్ధితప్రత్యయాలు '-(అ)రి, -ఇక, -ఇకము, -కాఱు, _గార్, -వల-, -ఱు' అనేవి స్పష్టమైనవి. ఉదా. (i) చేసేవాడనే అర్థంలో -(అ)రి: తల-వ్‌_అరి, కమ్మ్-అరి, పూజా_రి, పుర-వ్‌-అరి. ప్రాతిపదిక చివరి దీర్ఘాచ్చుమీద ప్రత్యయాద్యచ్చు లోపించటం, హ్రస్వాచ్చుమీద ఆగమాత్మక వకారం రావటం, గమనార్హాలు. (ii) స్వార్థంలో -ఇక: మాన->మాన్‌_ఇక; (iii) సమూహార్థంలో -ఇకము: రట్టడి→రట్టడ్‌-ఇకము; (iv)

32. ఆంధ్రభాషా వికాసము, పే. 807.

కలవాడు అనే అర్థంలో -కాఱు/-కాఱ: నిబంధ-కాఱు, అంక_కాఱ, ప్రవి_త్తి-కాఱ్. ఇప్పటి '-కాడు/-గాడు'లకు ఇది పూర్వరూపం. దీని ప్రాచీన రూపం *కాన్ట్రకావచ్చు. హల్పూర్వానునాసికలోపాన్నిబట్టి ఇది కన్నడం నుంచి ఎరువుగావచ్చి వుంటుంది. (v)చేసేవాడనే అర్థంలోనే -గార్ :కఞ్చ-గార్-లు. 'కాంస్యకార' శబ్దభవమైన ఈశబ్దంలోని ప్రత్యయంకూడా అర్య భాషాభవమనే చెప్పాలి. '-కాఱు, కారు' ల్లోని రేఫభేదం ఇందుకు మంచి ఉపపత్తి. (vi) బహుళా దిగర్థంలో _పల-: లో-పు, లో-పల్-ఇ. 'డా-పల, వెలు-పల' వంటిశబ్దాల్తో పోల్చి ఈ ప్రత్యయాన్ని వ్యాకరించటం జరిగింది. (vii) స్వార్థంలోనే -ఱు: పొద-ఱు. 'పొద'శబ్దంతో పోల్చినప్పుడు ఇది సాధ్యం. బహుళా 'కూతు, కూతుఱు' శబ్దాలుకూడా ఇటువంటివేనేమో.

శాసనభాషలో దొరుకుతున్న క్రియాపదాలతోనే పోల్చిచూసినప్పుడు క్రియాధాతువునుంచి విశేష్యాలను ఏర్పరచే కృత్ప్రత్యయాలు ఏడే దొరుకుతున్నాయి. ఉదా. (i) కూట్-అము_న; (ii) వాడ్-ఇక_లు; (iii) డిగ్గ్-ఇలి; (iv) తో-ట_ఋ, పణ్_ట; (v) నంజు-డ్-లు; (vi) తూజ్-పు, కా-పు-ఋ; (vii) కొల్_వు_నన్. పైనపేర్కొన్న '-అము-, ఇక-, -ఇలి,-ట-, -డ్-, -పు, -వు'లలోని చివరిరెండూ చకారస్థానంలో ఆదేశమయిన విని మాయకసపదాంశాలే.

శాసనాల్లో దొరికిన భిన్న స్థలనామాలను మాత్రమే పోల్చినప్పుడు ముఖ్యంగా 45 స్థలనామప్రత్యయాలు లభిస్తున్నాయి. వాటి ప్రాథమిక సపదాంశాలను మాత్రమే పేర్కొందాం. ఉదా. వుద్_అలి, మ్లావ్-ఇండి, అత్త్-ఇలి, పట్ట్-ఊర్, కొడ్-ఇంకి, కన్ద్-ఏఱు, నిడుం-గట్ట, పులి-కల్లు,నిడు-గాడు, గారల-గుణ్ట, కడా-కుదురు, కొల్లి-కుఱ్ఱు,అతు-కూరు,తాన్ని-కొన్ఱ, తామర_కొలన్_ఇ, ఒం-గోడు, నన్ది-గామ, పరు_వి, చెఞ్-చెఱువ్,కారమి-చేడు, నలూ_చేరి, పరివ-తుర్ల, అఱు-తొఱె, కసుం-దల, పళ్ల-నాణ్ట్_ఇ, కొణ్డ-నూర్_ఇ, విరి-పర, పెణుక_పఱ్ఱు, ఉరువు-పల్లి, గొల్ల_పల్లు,దూద్రు-పాక, ఇలు_పాడ్-ఉనుం, మల్క-పోరము,అమ్మల-పూణ్డి,చెఱు-పూర, ఇన్-వుఱోల్_ఇ, నోర-మడి, చేర-మఙ్గలమ్ము_న, గో-మడువు, పెను-మణ్డ, రావి_రేవు, ఏఱు_వ, కుడా-వాడ, పూల్ల-వట్టమ్మున, గణ్డ-శాల. ఆయాప్రత్యయాల చరిత్రను చర్చించటం ఇక్కడ సాధ్యపడదు.

వ్యక్తి నామప్రత్యయాలు పురుష, స్త్రీ, ఉభయవాచకాలని, పునరుక్త, పూజ్యార్థకాలని, ప్రధానంగా అయిదు విధాలు. అయిదురకాల పురుషవా-

చక ప్రత్యయాలు దొరుకుతున్నాయి. ఉదా. (i) మన్చ్య-అణ్ణ, వినియ్-అణ, కొమ్మ్-అర, అయ్త్-అన్న-యు; (ii) విట్ట్-అప; (iii) మార్-అయ్య, కొచ్చ్-ఇయ, కొణ్డ్-అయ-కు, ఎబ్-ఎయ. ఇకారాదిపదాంశాలు క్రీ.శ. 11వ శతాబ్ది కిముందు బహువిరళంగాను, 11వశతాబ్దిలో-ముఖ్యంగా గోదా మరీ మండలంలో-అత్యంతబహుళంగానూ, కనిపిస్తాయి. ఎకారాదివి కన్నడ సీమకు దగ్గరలోఉన్న తెలుగుప్రాంతాల్లో అధికాధికం. ప్రత్యయగతయ కార ప్రభావంవల్ల ప్రత్యయాద్యచ్చు తాలవ్యీకరణం పొందివుంటుంది. (iv) మఋన్ట్-పిదుకు, మాట్-పిడుగు; (v) అణ-పోతు-లు. సంస్కృతసమమైన 'అంబా' శబ్దం గల స్త్రీ ప్రత్యయం ఒక్కటేదొరికింది. ఉదా. మేట్-అంబా.

స్త్రీపురుషోభయవాచకప్రత్యయాలు అయిదుమాత్రమే లభ్యపడ్డాయి. ఉదా. (i) పురుష. తాత్-అమ్మ: స్త్రీ. కుట్ట్-అమమ్మ; (ii) పురుష. వేణ్-అప్-ఓఽన్టు: స్త్రీ. బిజ్జెక్-అవ్వ; (iii) పురుష. దేప్-అణ్డి: స్త్రీ. భూమ్-అణ్డి-యును; (iv) పురుష. పడ్-అలు: స్త్రీ. మన్మట్-అళు; (v) పురుష. కూచ-పోటి: స్త్రీ. వసన్తి-పోటి. పై వాటిలోని '-అణ్డి,-అళు' ప్రత్యయాలు రెండూ మూలదక్షిణ ద్రావిడ శబ్దం *ఆళ్/*ఆణ్ (=*వ్యక్తి)నుంచి ఏర్పడ్డవి. స్త్రీపురుషనామాలు రెంటిలోనూ కొన్ని సమయాలో పునరుక్తప్రత్యయాలు కనిపిస్తాయి. ఉదా. పురుష. విద్ద్-అమ్-అయ్య; స్త్రీ.మీన్-అప్-అమ్మ, పాంవ్-అక్-అమ్మ-కు. కాని ఈపద్ధతి విరళంగా ఉండేది.

బహువచన లు ప్రత్యయాన్ని పూజ్యతాసూచనకు ఎక్కువగా వాడే వారు. అదిగాక మరినాలుగు ప్రత్యయాలు కనిపిస్తున్నాయి. వాటిలో చివరిది (-గారు/-వారు) ఇప్పటికీ నిలిచింది. ఉదా. (i) జేయమ్-అయ్యారు. ఇది తమిళంనుంచి ఎరువుగా వచ్చింది (ii) కణమ-య్-అరు. ఇది *అవర్ శబ్దభవం కావచ్చు. (iii) రేవణ-కాలు, కుణ్డి-కాళ్లు. ఇది మూలద్రావిడ బహువచన ప్రత్యయం *-కళ్ నుంచి ఏర్పడిందనటంకన్నా "కుణ్డిపాదాః" అనే సంస్కృతశబ్దానికి ఎరువు అనువాదం అనటమే సంభావ్యం. (iv) పోత య్యం-గార్-ఇ, విట్టపరడ్డి-వార్-ఇకి. వీటిలో రెండోది అధిక పూజ్యతా సూచకం.

తెలుగుభాషలో ప్రవేశించిన ఎరువుమాటలూ వాటి పదాంశాలూ తెలుగు వర్ణమాలలో మార్పులేకుండా ఇమిడిపోతే అవి తద్భవాలని, ఇమడక పోతే తత్సమాలని, ఆ రెండురకాల పదాంశాలూ దేశ్యాలతో గాని తమలో తాముగాని కలిసి పదాలు ఏర్పడితే మిశ్రపదాలని, ఇక్కడ వ్యవహరిస్తు

న్నాం. (సంప్రదాయ వ్యాకరణ నిర్వచనాలతో ఇక్కడ ప్రసక్తిలేదు). ఆ లెక్కన దేశ్యదేశ్యేతర పదజాలాన్ని పోల్చిచూస్తే, తెలుగుభాషలో ఇమిడి పోయిన ఎరువుమాటలు క్రీ. శ. 6-9 శతాబ్దుల మధ్య మొత్తం పదజాలంలో 20-25 శాతం ఉండగా 10, 11 శతాబ్దుల్లో నూటికి 50 పాళ్లు అయినాయి. కావ్యభాషా ప్రభావమే ఈ మార్పుకు ప్రధానకారణం. ఎరువుమాటల్లో అత్యధికభాగం సంస్కృత ప్రాకృతాలనుంచి వచ్చినవే.

సంస్కృతంనుంచి వచ్చిన ఎరువుమాటల్లో అర్థవిపరిణామం, సంస్కృత వ్యాకరణవిరుద్ధత, అనే రెండు ప్రధానలక్షణాలు కనిపిస్తాయి. ఉదా. (i) అర్థ విపరిణామానికి : వక్రమ్బు (=అడ్డు), కరణమ్ (=గ్రామాధికారి), జీవితంబు (=జీతం), నియోగముల్ (=జిల్లాలు), మొ; (ii) వ్యాకరణ విరుద్ధతకు : ఉరమాల (=ఉరోమాల), ప్రధాని (=ప్రధానుడు), మనో వల్లభి (=మనోవల్లభ), వనజనేత్రి (=వనజనేత్ర), మొ. మాటలూ క్రీ.శ. 11వ శతాబ్ది వే

'మిశ్రసమాసా'లని, 'వైరిపదా'లని నిషిద్ధంగా ఉన్న మిశ్రపదాలు క్రీ.శ. 7వ శతాబ్దినుంచీ లభిస్తున్నాయి వీటిలో తత్సమదేశ్యమిశ్రపదాలు సంఖ్యాధికాలు; తద్భవదేశ్యమిశ్రపదాలు పైవాటితో సగంమాత్రమే. ఈ పదమిశ్రణం పద్యశాసనాల్లో అత్యల్పం; గద్యశాసనాల్లో అత్యధికం. ఇది నాలుగురకాలు ఉదా (i)దేశ్యం+తద్భవం: కణ్డసామి, గొల్లపల్లు,తామర చెరువ్, మావ్వణ్ణలగరుడణ్డు, మొగమాడువ్, సత్తిగనంకకాఱు, మొ (ii) దేశ్యం+తత్సమం: అమృతపడి, గోమడువు,జనకోట, గణ్డభైరవ,జయమాడ, జీవితమాడ, త్రికోణమడువు, పోర్ముఖరామ, ప్రోలేశ్వర, మనవర్తిన్కం, శ్రీపూణ్డి, వీరపెమ్మాణ్డిదేవర, మొ. (iii) తత్సమం+తద్భవం: ఉదార బుద్దిన్, ఘనరాచమణి, చౌషష్టి, దేవద్రోగులు, రాచమానంబున, లోహ దణ్డు, సవ్వణ్ణాదపరియారువు, మొ. (iv) దేశ్యం+తద్భవం+తత్సమం: వేణవోజన్ము, మారపాసారి, దేవాణోజ్జలకూ, మొ.

స్వరం, విరామం, ఉచ్చారణపద్ధతి వంటివి ఏవిధంగా ఉండేవో సరిగా తెలీదు కాబట్టి ఆనాటి వాక్యనిర్మాణాన్నిగురించి విపులంగా చెప్పటం అసాధ్యం. అయితే కొన్ని విలక్షణతలను గుర్తించవచ్చు ఉద్దేశ్యవిధేయపూర్వక వాక్యరచన సాధారణంగా ఉండేది. పదవిన్యాసం కర్త-కర్మ-క్రియల వరసలో ఉండేదిగాని ఆక్రమం అక్కడక్కడ మారేది. కర్త సాధారణంగా ప్రథమావిభక్తిలో ఉండేది. కర్మ ప్రాణివాచకమయితే ద్వితీయాచతుర్థుల్లో

ఏదో ఒక దాంట్లోను, అప్రాణివాచక మయితే ప్రథమలోను, ఉండేది. సాధారణంగా విధేయం ఉద్దేశ్యానికి ముందు, అవ్యయం క్రియకు మునుపు, విశేషణం విశేష్యానికి పూర్వాన, పరోక్షకర్మ ప్రత్యక్షకర్మకు వెనకా, ఉండేవి. నామాఖ్యాన, క్రియాఖ్యాన పద్ధతులు రెండూ ఉండేవి. కొన్ని సమయాల్లో ధాతుజవిశేషణాలనుకూడా వాడని నామాఖ్యాన పద్ధతి కనిపిస్తుంది. సంస్కృతసాహితీప్రభావంవల్ల తెలుగులోకి వచ్చిన యత్తదర్థక, కర్మణ్యార్థక ప్రయోగాలు విరళంగాఉండేవి. కర్తృ, కర్మ, క్రియారహితవాక్యాలు కొన్ని లభిస్తాయి.

ప్రాచీనాంధ్రంలో మొట్టమొదట నామాఖ్యానమేగాని క్రియాఖ్యానం లేదనే వాదముంది.[33] అటువంటిక్రియాశూన్యత లేదనటానికే ఎక్కువ నిదర్శనలు లభిస్తాయి. మచ్చుకు క్రీ.శ. 7వ శతాబ్ది శాసనాలనుంచి కొన్ని ఉదాహరణలు: బోళచేత శవణ గొణిరి (A10.2:600-25); విషయబోళ కొణిరి (A10.5:600-25); కమ్మరి వినియణ వ్రాసె (A12.21-22:625-50); కుమారశమ్మాణరికి ఉదకపూర్వ్వకా జ్కేసి ఇచ్చిరి (A24.5:699-700); కఞ్చుగార్లు కొట్టిరి (A24.8:699-700); గొరవళ్ మెచ్చి చే నిచ్చిరి (A25.35-36:7th). ఇటువంటి పూర్ణవాక్యాల్లోని సమాపకక్రియల సంఖ్య ప్రథమపురుషబహువచనం, మధ్యమపురుషబహువచనం, ప్రథమపురుషైకవచనం, ఉత్తమపురుషబహువచనం, మధ్యమపురుషైకవచనం అనే దిగుడు వరసలో కనిపిస్తుంది.

నామాఖ్యానం క్రియాఖ్యానంకన్నా విరళంగా ఉండేది ఇది మూడు విధాలు. ఉదా (i) క్రియాపదరహితం: ఇన్దోలు దినికినఙ (A10.4-5:600-25), పెగ్గడ మేడవ్రాలు (A54.7:742-98), దీని అరి నల్వుముద్దు (C7.9:8th); (ii) ధాతుజవిశేషణయుక్తం: కుణ్డికాళ్ళుళ ఇచ్చిన పన్నన ఇరవది యదినాల్కు మఱుస్తుల్ల నేల (A2.11-14:575-600); (iii) సార్వనామిక విశేష్యయుక్తం: నీవు నా ప్రాణసమానుణ్డవ్ (A87.26-27:892-922).

పూర్వోక్తసాధారణలక్షణాలు పూర్తిగా అన్వయించని పదవిన్యాస క్రమం తొమ్మిది రకాలు. ఉదా. (i) కర్తృరహితం: పానపోతుల ముచ్చియకు...ఇచ్చిరి...నేల (A12.29-31:625-50); శవనబోళకు...మఱుపొలము పన్నస అడి యిచ్చితిరి (C7.4-8:8th); (ii) కర్మరహితం: కఞ్చుగార్లు

[33] ఆంధ్ర భాషావికాసము (1948), పే. 143, 144, 150.

కొట్టిరి (A 24.8:699-700); ప్రభురాముస్టు క్లోచె (A 65.13-14:8th); (iii) వాక్యాంతంలో కర్త: ప్రసాదచేసిరి....తొల్పకామి రట్టగుళ్ళు (A 44. 12-15;700-25); దీవియ వెట్టెం బద్మావతియును (A141.21:1075-76). రెండో వాక్యం పద్యశాసనంలోది. (iv) వాక్యాంతంలో కర్మ: గణ్ణర ముత్రాజుపొడిచి పడియె టోఙ్కు శాకు(A94.3-6:9th/10th);మల్లన్ద్ర త్తించె గుడియు మఠంబునుం గా త్తికేయునకు (A 89.27-29:898-934). రెండోది పద్యశాసనంలోది. (V) కర్మ-కర్త-క్రియ: శ్రీసతికి దత్తి హంగుణువుళ దేవణ యిచె (A 66.1-8:7th); (vi) కర్తృపదపునరుక్తి: పెటనివారు... అలిసినవారి పాపంబు గొణ్డు వెటనివారు (A 66. 2-5:8th); (vii) విశేష్యం-విశేషణం: నిల్పె విద్ధమయ్య విప్రకవచమ్బు (A17.4:650); శ్రీయుద్ధమల్లు డ్డెత్తించె నమిత తేజుండు (A 89.43-44:898-934). రెండో వాక్యం పద్యశాసనంలోది. (viii) పరోక్షకర్మ-ప్రత్యక్షకర్మ:గఙ్గుదేవరకు నముదునకు దారపోచి యిచ్చినాణ్డు (C14.13-15:1096). (ix) క్రియ-అవ్యయం:సిత మణిబన్ధ మిచ్చె సన్మణియుతముగన్ (A136.6:1065).ఇది పద్యశాసనంలోది.

సంస్కృతమర్యాదానుసారి అయిన యత్తదర్థక ప్రయోగాలు నాలుగేనాలుగు లభిస్తున్నాయి. ఉదా. నీకేమి వలయు దాని వేడ్డికొమ్మ (A87.30-32:892-922); ఎవ్వణ్డేని రక్షించు వానిద ధమ్మ్మకావు (A114. 7:10th); ఈ ప్రవృత్తి ఎవ్వాండేని అపహరించిన వాని పితృ పితాంమహులు... (A120.12-14:1003). వేగినాణ్టి కెవ్వరు రాజులై రి వారుం...పాలించువారు (A110.34-38:1006).

సంస్కృత భాషాప్రభావంవల్ల తెలుగులో ప్రవేశించిన కర్మణి ప్రయోగాలు మూడేమూడు దొరుకుతున్నాయి. ఉదా. పట్టం కట్టబడిన వాన్డు (A 77.5-6:825); అతని చేయంబడిన ధమ్మ్మకావుల (A 87.55-56: 892-922); వైదుంబుళచేతం బట్టం కట్టబడి యేలి (A94.4-5:9th/10th).

కావ్యభాషలో కనిపించే రకం పదబంధాలు కొన్ని కనిపిస్తాయి. ఉదా. విడిచిన బసిణ్డి (A21.14-15:678); ప్రసాద చేసిరి. (A44.12-13: 700-25): సురలోకం బెజ్జె (A79.10:825): సుఖంబుణ్డి (A87.23-24:892-922); సుఖంబు మనువారు (A 87.68:892-922); అతని కొట్టించిన చెఱువులు (A87.53-54); అతని చేయంబడిన ధమ్మ్మకావులు (A87.55-56); నీ చేసిన యుపకారంబునకుం (A87.27-29); తము ప్రతిష్టసేసిన...(A 80. 66-70:1060); తమ వేయించిన...(A130.61-65), మొ.

పోలికను చెప్పటానికి 'పోలు' ధాతురూపాలు వాడేవారు. ఇందుకు దొరికిన మూడు ప్రయోగాలూ పద్యశాసనాల్లోవే. ఉదా. ఈశ్వరునకుం గార్త్తికేయున్డుంబోలె (A86.3:850); బెజయితదేవని కూంతు సరియ పోల్వం గాంత లెందు (A136.11:1065); భూమిదేవిం బోల్ రేవలదేవి.... (A136.4-5).

సంస్కృతాంధ్ర పదబంధాలు మేళవించి వాక్యరచన చేయటానికి 'మణిప్రవాళ శైలి' అని పేరు. సాహిత్యంలో లాగానే శాసనాల్లో కూడా ఈ తీరు రచన క్రి.శ. 7వ శతాబ్దినుంచీ విరళంగా ఉండేది. ఉదా. క్షేత్రం ఖణ్డుగ వడ్ల సహితం (B23.28:674);....ఏఱువవిషయం బేళన్ తస్య మాతా దత్తం...శతపంచాశత్ క్షేత్రమ్ (A22.8-9:680); దేవశర్మ్మణస్య గుడి (A73.2:8th); కొఱ్ఱబోయు తటాకః (B53.59:945-46).

జాతిద్రవ్యాదుల్ని పృథక్కరించి చెప్పటానికి సప్తమీ ప్రత్యయాన్నో అనుబంధాన్నో వాడటం క్రి.శ. 7వ శతాబ్దినుంచీ వాడుకలో వుంది. ఉదా. శ్రీ చోఱమహారాజుల్లోళన ఇన్నుటోలి అణపోతులు (A 8.1-2:600-25); జాదిరాజుల అన్దు పళ్ళియరి కొడుకు (A82.6-8:850).

'ఉండు' ధాతుక్త్వార్థక రూపంతో ఆరంభదశను, చతుర్థీప్రత్యయంతో అంతిమదశను, నిరూపిస్తూ కాలస్థల నిర్దేశం చేయటం అనాదిసిద్ధంగా ఉంది. ఉదా. ఒంగోడు నుండి ఱిగదేబు పళ (?)కు పోవు వన్ధా (B 32.16-17: 696-709); చేబ్రోలు నుండి బెజవాడ జాత్రకు వచ్చి (A89.22-23;892-922).

శాసనైకాధారమైన ప్రాచీనాంధ్రభాషను శాస్త్రీయ పద్ధతుల్లో పరిశీలించినప్పుడు అది 'ద్రవస్థితి'లో ఎన్నడూ లేదని,[34], దాన్ని నన్నయ సంస్కరించి 'ప్రమాణీకరించ' లేదని,[35] అది ఎల్లప్పుడూ సువ్యవస్థితంగా వ్యాకరణీయంగా ఉందని, తెలుస్తుంది.

ప్రాచీనాంధ్రశాసనభాష నాలుగు దశలు గడిచింది. అని ప్రాగాంధ్ర దశ; ప్రాక్సాహిత్యదశ, సాహిత్యదశ, కావ్యభాషాదశ, అనేవి. వీటిలో మొదటిది ప్రాచీనతమశాసనకాలానికి చాలాముందే పూర్తయింది. అప్పటికే ధాతు ప్రత్యయాలమధ్య అచ్చులుచేరటం, వర్ణవ్యత్యయ అచ్సంకోచాల వల్ల పదాదిసరళాలూ సంయుక్తాక్షరాలూ ఏర్పడటం, వర్ణసమీకరణంవల్ల

34. ఆంధ్ర భాషావికాసము, పే. 96, 148, 233;234.
35. అదే, పే. 98, 148-155, 209-229, 235.

ద్విరుక్తవర్ణాలేర్పడటం, తాలవ్యీకరణం, వంటి ప్రధానపరిణామాలు పూర్తి అయినాయి

ప్రాక్సాహిత్యదశలో (క్రీ.పూ. 200-క్రీ శ. 600) ఱకారం ప్రత్యేక వర్ణంగా ఉండేది. రేఫఱకారాలు మేళవించాయి. పదమధ్యసంధులు మొదలైనాయి పదాంతసంధి ఉండేది కాదు. గసడదవాదేశం వైకల్పికంగా ఉండేది. సంస్కృతప్రభావం, అనుస్వారలేఖనం, స్థిరపడ్డాయి. ప్రత్యేకభాషా లక్షణాలు వ్యవస్థితమైనాయి.

సాహిత్యదశలో (క్రీ.శ.601-900)వ్యావహారిక, సాహిత్యక, మాండలికాలు ఏర్పడ్డాయి. పద్యశాసనాలు మొదలైనాయి. సంస్కృత ప్రభావంతో రేఫమీద హల్ద్విరుక్తి అరంభమయింది, లేఖనంలో. అచ్చులకు అనునాసిక్యం మొలకెత్తింది. పదాది యవకారాలు, ద్విరుక్తాద్విరుక్త హల్లులున్న జంట మాటలు, వాడుకలోకి వచ్చాయి. ఱకారం ప్రత్యేకవర్ణత్వం కోల్పోయింది. అజ్మధ్యడకారం ణకారంగామారటం మొదలయింది. శకటరేఫ రేఫతో మేళవించింది. సంయుక్తవర్ణాల్లో వకార పరకమైన రేఫ నిలిచింది; ఇతర వర్ణపరకత్వంలో తానేచ్యుతమయింది. 'న్ఱ' అనే సంయుక్తధ్వని 'న్ద, ణ్డ, ణ్డ్రి' లుగామారింది. అత్సంధివైకల్పికమయింది. గసడదవాదేశం బహుళమయింది. ద్రుతసంధి పద్యంలో నిత్యమై గద్యంలో వైకల్పికమయింది. '-ంబు' ప్రత్యయం '-ము, -వు, -మ్ము'లుగా పరిణమించింది. మిశ్రసమాసకల్పన అధికమయింది. యత్తదర్థక కర్మణి ప్రయోగాలు భాషలో చోటు సంపాదించాయి. నాలుగోవంతు మాటలు ఎరువుగా వచ్చాయి. 'మణిప్రవాళశైలి' ఆచారంలోకి వచ్చింది

కావ్యభాషాదశలో (క్రీ.శ.901-1100) ఎరువుమాటల సంఖ్య రెండింతలు పెరిగింది. 'ఎడి/-ఎడు' ప్రత్యయం '-ఏ(టి)'గా మారింది. క్రియాపదాల్లో తచ్ఛబ్దవకార లోపం మొదలయింది. నామాంతంలోని '-ఇయ'ఆద్యచ్చు పోగొట్టుకోవటం ఆరంభమయింది. అమహత్ప్రత్యయం '-ము'లోపించి తత్పూర్వస్వరం దీర్ఘం కావటం ప్రారంభించింది. వర్ణవ్యత్యయంవల్ల రెండు హ్రస్వాచ్చులు పక్కపక్కలచేరి దీర్ఘాచ్చుగా మారటం (అనం >నాం) మొదలుపెట్టింది కావ్యరచనకు మార్గదర్శకమైన విలక్షణపదబంధకల్పనలు, అసాధారణ వాక్యరచనలు, ఎక్కువైనాయి.

ఇది ప్రాచీనాంధ్రశాసనభాషాచరిత్రకు అత్యంతసంక్షిప్తరూపం.

## A BRIEF HISTORY OF THE LANGUAGE

In early Telugu (upto1100 A.D.) there are 23 consonant and 10 vowel phonemes. The consonants are /k.g.ṅ,c,j,ṭ,ḍ,ṇ,t,d,n, p,b,m,y,r,(ṟ),l,ḷ,v,s,h, and (ḻ)/. Two of them given in parenthesis lost phonemic status during the historial period. The vowels are /a,ā,i,ī,u,ū,e,ē,o, and ō/. [ai] and [au] are not separate phonemes as they do not contrast with [ay] and [av], respectively. The half-nasal was only a morphophoneme. [ñ] was only an allophone of /n/ on account of non-contrasting occurrences such as pañcina/pancina[1]. The full-nasal was a cover-symbol for homorganic nasals and hence not a separate phoneme. The alveolar allophones of /c/ and /j/ do not occur in the material but [ts] in moḍatsa might be an approximation, for want of a separate graph for the alveolar allophone of /c/. Seven more co-existent phonemes are added to the inventory through Sanskrit and Prakrit loans: /kh,gh,ṭh,th.dh,ph,bh,ś, and ṣ/. But there is no evidence in the corpus to posit [ṭh] as a seperate phoneme. [ṝ, ḷ, and ḹ,] do not occur in the material. [ṛ] is not a separate phoneme as it did not contrast with [ri].

No geminates occur following a long vowel and no consonant clusters following /ō/. [ṅ,ñ,ṭ,ṇ, and h] do not occur word-initially. /ḷ/ occurs only before /ō/ and l/ḷ only before /a/ in clear cases. /k,t,d,p,b,m, and v/alone occur word-initially in conjunction with /r/, eg. krocce, trāgina, drōvadi, prālunu, bramana, mrāni, and vraccina. Only /k/ and /p/ occur word-initially in clusters with /l/, eg. kḻocce, pḻōlanāṇḍu, /k,g,c,j,ṭ,ḍ,ṇ,t,d,n,p,b,m,y,ṟ,l,ḷ,v, and s/ occur intervocalically both as geminates and single consonants. /r,h, and ḻ/ occur only as geminates in inter-vocalic position. Bi-consontal clusters are more frequent in inter-vocalic position.

---

1. For the dates, etymologies and occurrences of these and other inscriptional words cited hereafter, see Index Verborum.

Triconsonantal clusters are infrequent in the same position even in loan-words.

PDr *k-preceding palatal consonants generally developed into c- in Telugu. T. Burrow thought that this palatalization took place sometime between 300 B.C. and the first few centuries after Christ.[2] K. Ramakrishnaiah thought that it took place in PDr itself[3] and Bh. Krishnamurti stated that the change started either at the time when Telugu branched off from SDr or sometime earlier than the 5th cent. A. D. and that it was accomplished during the pre-literary period.[4] The word 'ceṟuvu' in cen̄ceṟuva and kamkurān̄ ceruva, occurring in the Pedavēgi ins. of 395-410 A. D. is traceable to PDr. *keṟay. This testifies that palatalization was accomplished by then. The word cilāta (<Skt. kirāta-) is found to occur in a Pkt. ins. of the 3rd cent. A.D.[5] It can be said on the strength of such evidences that the change started in 3rd/4th cent. A.D. in central Andhra. Unpalatalized forms of the verb *kēyu nevertheless occur infrequently till the 8th cent. A.D. kēcina (for kēsina) occurs in the Munjeru ins., kēsi occurs in the kotturu ins., and kēsina, kēsiri occur in Bhayravakonda inss. These forms attest that the change was accomplished much earlier than the 8th cent. A.D. but older forms are preserved largely owing to orthographical practices.

One of the important sound changes which was accomplished by the time of the earliest Te. inss. was the development of initial voiced stops. Bishop Caldwell argued that there were no initial voiced stops in PDr.[6] K.V. Subbaiah[7], T. Burrow[8] and Bh. Krishnamurti[9] support the above view whereas Jules Bloch[10], Godavarma[11], A. Master[12] and S.K. Chatterji[13] believed that there were initial voiced stops in

2. BSO(A)S 11.122-139, esp. .126.
3. JVOI 15.76.
4. TVB §1.11, esp. §1.18.
5. M. A. Mehendale, HGIP, Intro., p.xxiii and pp.120, 122, etc.
6. CDL, p.138-139.
7. IA 38.193-221.
8. BSO(A)S 9.711-722.
9. TVB §1.55 and §1.70-73 esp.
10. Jules Bloch, IA 48.194-195
11. BSO(A)S 8.562.
12. Ibid., 9.1008.
13. IL 14.9-15.

PDr. A study of early Telugu will not justify positing initial voiced stops for PDr for the following six main reasons:

(1) Native words with clear etymologies are not found to occur with initial voiced stops in the material anterior to the 7th cent. A.D.

(2) There are few assimilated loans which occur from the 6th cent. A.D. with initial voiced stops.

(3) There are doublets with and without initial voiced stops occuring at one and the same time within the material, eg. kuḍāvāḍa: guḍivāḍa; khaṇḍuga: gaṇḍuga; bādi śarmma: pādi śarmma, etc.

(4) There are instances when initial voiced stops in loans are devoiced, eg. tuga: duka/duga.

(5) It is not justified to posit initial voiced stops for PDr based on the few occurrences in the material of words with dubious etymologies like guṟaṃbu and gelci.

(6) There are many place-names and personal names with initial voiced stops whose etymologies are uncertain and unclear.

Words with initial voiced stops are of two types: (i) those which resulted from the voicing of unvoiced stops or are traceable to an initial /v-/ and (ii) those which resulted from metathesis. The initial voiced stops resulting from metathesis are again of two sub-types: words with initial single voiced stops and the same with initial consonant clusters.

K.V. Subbiah argued that initial voiced stops were developed in pre-Telugu as a result of metathesis and accent shift from the first to the second syllable.[14] The problem was examined by L. V. R. Aiyar[15] and M.B. Emeneau also.[16] Alfred Master called the development by a new name 'proenthesis.[17] Bh. Krishnamurti explains the situation by meta-

14. IA 38.209.
15. QJMS 22 448-480.
16. Lg. 21.191-192.
17. BSO(A)S 12.340-364.

thesis and vowel contraction ($V^1CV^2 > CV^1V^2 > C\bar{V}$).[18] Owing to these two changes, Telugu developed words with initial /g,ḍ,d,v,r,ṟ,l,ḷ, and ḻ/, eg. gāri, ḍaggumbaṟti, dāni, vānṟu, reṇḍu, ṟēni, lēci, ḷōna, and ḻaccu. oḷana ("..sōḻa mahārājull oḷana inpuḻōli aṇapōtulu.."), earlier form of ḷōna and aḻisina that of ḻaccu (<*aḻiyu) occur within the material. This development might have been accomplished much earlier than the 6th cent. A.D.

Words with initial consonant clusters resulting from metathesis and vowel contraction occur from as early as the 4th/5th cent. A.D. kḻ-, pḻ-, and vḻ- developed into kr-, pr-, and vr- by the 7th cent. A.D., eg. kḻocce: krocce; pḻāndoṟambu: prāndoṟu;* vḻ-: vraccina.

(aṟu)toṟe of the 4th/5th cent. A.D. is the earlier form of trōva of the 10th cent. That means that /ṟ/ in clusters fell together with /r/ by then, the intermediary form being *tṟōva.

Bh. Krishnamurti states that loss of /r/ in initial clusters might have happened sometime during the middle of the 12th cent. A.D.[19] but there is evidence to say that it started during the 7th cent. and was not accomplished during the historical period. The change, however was sporadic, eg. ayyavōḷu, gocci, pōlama, māni, etc.

Initial y- and v- are found to occur from the 5th and 9th centuries A.D., respectively. eg. yuḷḷalūru, yalamma; vakoṭṭi, vuddini. y- and v- are non-phonemic.

Suffixal -g- and -v- in inter-vocalic position are found to have changed to -v- and -g-, respectively. It is not possible to state where a particular development started but both the changes started during the 11th cent. Eg.

(i) -g-> -v- : nālugu vs. nāluvu

(ii) -v-> -g- : daṇḍuvu vs. daṇḍugu.

The develompment of PDr *ṉ into /n/ in Telugu started during the 7th cent. and was accomplished by the 9th cent.

18. TVB §1.121-138.

19. Ibid., §1.145.

Two words 'āṇati and paṇi' occur in the Rameswaram Pillar ins. of the 7th cent. An inverse spelling 'taṇa' appears in the place of a regular form 'tana' in the Cennarayanipalli ins. of the 9th cent. Although an original *ṇ was orthographically preserved through the 11th cent., it can be said that the phonetic change was accomplished by the 9th cent. itself.

An inter-vocalic /ḍ/ started changing into /ṇ/ during the 7th cent. in the Palnāḍu area. Eg. koḍikiṃ vs. koṇeki. This change is a sporadic one in the language.

One item /ceṟuvu/, occurring in the Pedavēgi ins. of the 4th/5th cent., has two forms with a trill and a flap in 'cen̄ceṟuva' and 'kamburān̄ ceruva'. This accounts for the merger of /ṟ/ with /r/ a long time before the date of the ins. /ṟ/ was lost in 'irukuṭūru' and 'ciṭṭēru' of the 7th and 8th cents. '-ūru' occurs with a trill in 'paḍamaṟalūṟi' during the 8th cent. The merger of /ṟ/ and /r/ into /r/ started in the cenral Andhra region during the 7th cent. and spread over the State within the next century. VṟV developed into VrV by the 8th cent.

PDr *ḻ started developing in Telugu into /l/ in intervocalic position by the 7th cent. and lost its phonemic status by the 9th cent. In one Dharanikota ins. of the 8th cent. the form 'kolaci' occurs without an expected VḷV. Inverse spellings are noticed in inss. of the Krishna-Godavari basin during the 7th cent. which hyperstandardized the PDr *l- forms by replacing them with -ḷ- forms. Eg. ayyavōḷu, kaḷar, taḷavara. It means that *VḷV developed into VlV by that time.

An inter-vocalic -ḻ- developed into -ḍ- by the 7th cent. Eg. kuḍucu, etc.

Early Telugu had geminate k,g,c,ṭ,ḍ,ṇ,t,d,n,p,b,m,y,ṟ, l ḷ,v, and s in inter-vocalic position owing to assimilation. T. Burrow[20] and Bh. Krishnamurti[21] believed that the development in question was accomplished during the pre-literary period. But the inscriptional material attests for the deve-

20. BSO(A)S 11.129.

21. TVB §1.179-180.

lopment from the 4th cent. A.D. This assimilation is of two types: 1. (C) VC-C>(C)V-CC:Eg. ic-cina; 2. (C) VC-V>(C) VCC-: Eg. koṭṭ-ūru. Forms without this development are noted to have occurred infrequently for seven centuries after the change was first attested in the material. Eg. perddal.

Geminate -ṇ- and -ḷ- are also noted to have developed into geminate -nn- and -ḷḷ- during the historical period. 'koṇṇa' of the 8th cent. changed to 'konna' by the 9th/10th cent. although forms like 'aṇṇa' were orthographically preserved through the 10th cent. An inter-vocalic geminate VḷḷV also developed into VllV by the 8th cent. Eg. paḷḷi vs. (raṇḍu) balli.

Inter-vocalic consonant clusters were developed during the historical period owing to assimilation (VC¹ C² V). -ṇc- > -nc- was one such development that was accomplished by the 9th cent. Eg. paṇcina: pancina. Similarly, -ḷk- > -lk- is noted by the 7th cent. Eg. palkina. /r̲/ in clusters also fell together with /r/ during the same period. Eg. tūr̲pu: tūrppuna. At the same time, -nr̲- developed into '-nd, -ṇḍ- and -ṇḍr-'. Eg. inr̲u: indula; (tānr̲i) konr̲a: koṇḍa; paṇḍr̲eṇḍu. -ḷp- changed to -lp- during the 9th cent. Eg. veḷpu: velpūru. /r/ in clusters developed into a geminate of the following consonant due to assimilation from the 9th cent. Eg. urpuṭūru: uppuṭūru.

Development of inter-vocalic consonant clusters due to the loss of vowels within words is noted to have occurred from the 11th cent. divya and dīvya (<Skt. dīpa-) occur in the material. Usages like 'divyār̲upu' in the literature of Tikkana attest to the accomplishment of the change by the 18th cent.

Doublets with and without graded vowels in the first syllable occur in the corpus. They are of two types : 1. those who do not alter the syllabic structure. Eg. embhadi: ēmbadi, kuntur̲: kūntur̲u; minda: mīndu; 2. VCC/V̄C: kl̲ōce: krocce, jūvi: juvvi. A few doublets with and without graded vowels in the second syllable also occur. Eg. kaḷar: kaḷār. This pair

lays at rest the view of the traditional grammarians who believed that 'kaḷār' was from *kaḷavār.

The orthographic practice in Telugu of employing the full-nasal (anusvāra) as a cover-symbol for homorganic nasals was an early borrowing from Indo-Aryan. Both the practices are obtaining from the 4th cent. and are in use within morphemes, at morpheme boundaries and in word-final positions. Eg. (i) within morphemes: pāṇṭūra, kaṃgūra/kaṅgūra; (ii) at morpheme boundaries: vilembali, cen̄ceṟuva; (iii) word-finally: pravartamānaṃ. Employing 'anusvāra' at the beginning of a line, a practice prohibited by scholars although the grammars have no overt statements about its disuse, is found to occur from the 7th cent. Eg. pulo-ṃbuna, siddhīśvara-ṃbuna. There are also hesitation forms with both 'anusvāra' and a homorganic nasal as well as instances where either of them were wrongly used. Eg. (i) hesitation forms: nāṃṇḍu, vēḷuguṃṇtha; (ii) wrongly written forms: nāmadhēyiṃṟu (=nāmadhēyunṟu), paṃnasa (=pannasa), cimthur (=cintūr/ciṃtūr), saṅvatsarambu (=saṃvatsaraṃbu), etc. It can be said that the employment of anusvāra came into use by the 4th cent. A.D. and the practice became well established by the 7th and 8th centuries.

On the whole, homorganic nasals were used more times than anusvāra upto the 11th cent. A.D. Afterwards, anusvāra became more frequent eventhough the use of homorganic nasals did not become obsolete. The use of anusvāra was more frequent in place of /ŋ/ and /m/, equal in place of [n̄] and infrequent in place of /ṇ/ and /n/. Anusvāra occurs before stops in native words, before /ṇ/ and /v/ also in assimilated loans and before aspirates and /ś,s, and h/also in unassimilated loans.

There was no separate graph for the half-nasal. The graph which was originally a dot and which latter developed into a zero was used to represent both the full- and the half-nasals. It is possible sometimes to reconstitute the half-nasal depend-

ing on metrical considerations. The half-nasal in orthography indicates nasalization of the preceding vowel. Eg. "..prabhuṃ baṇḍaraṃguṃ bancina....panḍrenduṃ ..vēṅgināṇṭim.." (A81. 4-6:848) has to be read as "*prabhū̃ baṇḍaraṅgū̃ bancina ..vēgināṭi..," otherwise metre is effected. Metre gets jeopardized if "..garvvaṃb....koṭṭaṃbul .."(A81.3,6:848) is not read as "*garvvam.. koṭṭamul..". Traditional grammarians state that there is no full nasal following a long vowel but in inss. we find usages like "..kūṃtu sariya pōlpaṃ gāṃtal eṃddu.." (A136.11:1065). This usage is comparable to the usage of the poet Nannecōḍa as in "..vīṃḍe khaluṃḍu dakṣū̃ ḍanu vīṟiḍi pāṟuḍu..," etc. These instances prove that the situation obtains in early Telugu atleast dialectally.

Early scholars believed that there was a consistent orthographic practice which indicated a half-nasal by not geminating a following stop and a full-nasal by geminating the same. But it was not consistent during the historical period. Eg. (i) No gemination of the following stop after a full-nasal: panḍuraṃgu, bimkam; (ii) Gemination of the following stop after 'ṃ' when half-nasal is impossible: sāmaṃtta-, ettiṃcce.

One has to believe that half-nasal is nasalization of the preceding vowel on the strength of kētana's description.[22] There is no evidence either supporting or to the contrary. Since anusvāra is only a cover-symbol for homorganic nasals, it was not a separate phoneme.

Loss of word final-a before a following vowel is attested from the 9th/10th cent. There is also evidence for the retention of -a during the 6th cent. and also for the development of an on-glide following -a from the 7th cent. Eg. (i) Loss: iḍḍaṭlu (<*iḍḍa+aṭlu); (ii) on-glide: kalayanta (<*kala+anta); (iii) Retention: pannasa iravadi. Glidal v- is also noted in some cases. Eg. eṟṟa-vummayunu.

Loss of -i was optional till the 9th/10th cent. but development of glidal -y- become more frequent afterwards. Eg.

22. ABB, stanzas 30, 56, and 57.

(i) Loss: śrīk-ellan; (ii) Glide: iravadi-yādi nālku; (iii) Retention: iru paḻayadi-ēnu.

Loss of -u was very frequent from the beginning. Glidal -y- is noted following -u from the 7th cent., with increasing frequency through the 11th cent. The loss of -u was therefore only optional and non-automatic. Eg. (i) Loss; ūḍl-aṃḍu; (ii) Glide vāru- yiṟla kanu; (iii) Retention: rēṇāṇḍu-ēḷan.

Loss of word final vowels even before consonants is noted sporadically. Eg. an-vāru, nal- tumuḍlu. It is more correct to state that the consonant-ending words did not develop a final vowel. The final consonants of monosyllabic roots are found to be geminated before following vowels from the 7th cent, Eg. ann-ēṇṭan.

k->g-,c->s-,t->d-, and p->v- in external sandhi is found to be optional in the beginning and automatic between the 8th and 11th centuries. Eg. (i) k->g-, etc.: āṇati-gānu, stiti-dappi, paṇi-sēsina, ēnu-vuṭlu; (ii) No change: reṇḍu-tōṭaḷu, āḍlu-paṭṭu. This change is more frequent than as stated by traditional grammars and is found to take place in unassimilated loans, following words ending in -n, following adjectives and past participles and also in close juncture within compound words. Eg. (i) in unassimilated loans: kalayanta-gālaṃbuga, bejeyēśvaraṃbu- galasa nirvvahanaṃbu, vittu paṭṭu-vrasādan̄ cēsi; (ii) following -n: nāḷunu-vuṭṭu, kaṭṭe-sure, indu-vratyakṣaba yannan, pasula- saṃpina: (iii) following adjectives: iru-vuṭṭi; (iv) following ppt.: pondi-gāni; (v) in closed syllables: ayya-vōḷu, niḍuṃ-gaṭṭa, daṃma-vuraṃ-buna. But these instances are very few.

What is called 'druta' is nothing but a word-final -n. Voicing of voiceless stops following -n was only optional between the 6th and the 9th centuries. It became more frequent in the course of time but it was not automatic even during the 11th cent. This external sandhi is of 10 types. Eg. (i) following acc.: dīni- gācina vāru, pāṟa- jampina vāṇṟu;

(ii) following instr.: vaidumbuḷa cētaṃ-bāṭṭaṃ kaṭṭabaḍi; (iii) following dat.; nāku- baṇi sēsina; (iv) following loc.: sudda pakṣabuna-bañcamiyu; (v) following con clitic: paṇḍ-ṟeṇḍuṃ- goṇi, guḍluṃ- brākāraṃbu; (vi) following inf. vb.: kaṭṭa- baḍina; (vii) following p.fin.: kattiṃceṃ- gramabuna; (viii) following oblig. vb.: cēyavalayuṃ-gāna; (ix) following adj.: niṇḍu-jeṟuvuna; (x) following adv.: nēlayellaṃ- gāvaṃ-būni. There are instances where the changes have not taken place.Eg. pāṟaku- kuṇḍikāḷḷuḷa, pulombuna- ceṟuvu paḍu-māṟi kōṭan, cēramaṅgalambuna- toṟṟu koṇṇan, ēṇṭan- paḷli-nāṇṭi.

Glidal y- and v- are discernible from the 7th cent. following words ending in -n. This means y- and v- words were obtaining from then.Eg. (i) y-: pañcamiyu- yādityavā-raṃbu, turumara viṣayaṃbu- yēḷuvāri, paḍumaṭa- yēḍuvutl; (ii) v-: iṟla kā- veṟuguvāru, pōṭuna- vakoṭṭi, raṭṭaguḍiyu-vuddini. Developing a glidal y- following words in nomina-tive case also is found during the 7th cent. Eg. saṃvatsaraṃ-buḷ- yēn agu nāṇḍu.

Irregular sandhi modelled after Telugu in the case of loans and vice versa is also found though rarely. Eg. (i) loans: nīlīsvara (for nīlēśvara); manc-yanna (for mancaṇṇa/manci-yaṇṇa).

Although stem alternation is part of internal sandhi, that is treated elsewhere. /r/ in closed syllables in a cpd. is changed to [ṟ]. Eg. paṇḍṟeṇḍu (<pan/paṇ-reṇḍu), viṭṟajula (<viṭ-rajula), koṇḍṟu (<koṇ-ḍu-ru). The development of an intru-sive -ḍ- before /r/ in words like 'vāṇḍru' and trilling of a flap following a retroflex (as in viṭṟajula) are some of the significant features in internal sandhi. It can be presumed that [ṟ] has a stop value during the 9th century and that the sequence '-ḍ-ṟ-' or [*-ṉ-ḍ-] an africate value. /n/ and /m/, preceding a palatal consonant, are noted to have merged with /n/ in closed syllables by the 4th/5th cent. Eg. kamburāñceṟuva, ceñceṟuva. Similary, a word final -m preceding a velar stop

in closed syllables changed by the 7th cent. into a velar nasal. Eg. udakapūrvvaṅ kēsi.

1882 different noun words occur in the corpus of which 573 are native words, 211 are assimilated loans, and 424 unassimilated loans. Most of the masculine noun have no gender markers. Eg. talavari, mancyaṇṇa, rāju, kammari, koḍuku, etc. Some noun words occur with and without gender markers. Eg. (i) n.w.: gaṇḍa, gaṇḍa-ṇḍu; (ii) a.l.: bōya, bōya-ṇḍu; (iii) u.a.l.: pātaku, pātaku-nṟ. Masc. nouns with gender markers show different suffixal allomorphs. Eg. dhanaṃjayu-ṟu, uttamōttamu-nṟu, vā-ṇḍu, saṃyuktu-nṟ, kuḷḷamma-n. Of these -n might have been an archaic form and a loan from Tamil. The masc.suf. '-nṟu' changed into '-ṇḍu' by the 7th cent., although it was preserved orthographically upto the 10th cent. The change was accomplished by the 9th cent. It changed optionally into '-̃ḍu' in verse with nasalization of a preceding vowel. The n.ws with -nṟu are very few. The word final -a is changed to -u optionally in loans when the gender marker is added. Eg. ōja-nṟu, uttamōttamu-nṟu. The form 'dhanaṃjayu-ṟu' may be a borrowing from Kannaḍa in which the loss of a preconsonantal nasal is a regular feature. T. Burrow believed that the PDr masculine singular suffix was *-nṟ and that *-ṟ in the sequence was lost in SDr. M. B. Emeneau thought that originally the suffix was "*-nṟ/-*nṯ" which possibly had an alveolar pronounciation [*-ṉ-ṯ] and the *-ṯ of the sequence was connected with *atu, the non-masculine singular suffix.[23] Generally, the masculine singular suffix is dropped before the plural suffix. In the light of this common tendency, the "-ṟ" of 'kunṯuṟ', a non-masculine word, may be treated as a singular number marker when the set "kuntuṟ" (sg.) vs. "kuntul" (pl.) are compared with each other. This segmentation could be valid in view of the fact that gender distinction was not rigid in Dravidian.

Words without gender markers and those with and with-

23. **Kolami-A Dravidan Language, §10.15.**

out them appear in non-masculine singular also. Those without gender markers occur in numbers. Eg. vēpura, paṇṭūra, koṭṭūru, aṟutoṟe, tānṟikonṟa, datti, nēla, āṇati, and host of others. Doublets with and without gender markers are small in number. Eg. (i) n.ws: illu: kō-yilamu; kuṃcca: kuṃcca-mu; tuvatoṟu: pl̲āndoṟa-ṃbu; rāmaḍu: maḍu-vu; mōdo-$\phi$- lu: moda-vu-lu; (ii) a.l.s: daṇḍu: daṇḍu-v; pala: pala-mu; (iii) u.al.s: dramma: dramma-mu; mānika: mānika-mu. Some non-masc. words occur with the gender marker in various shapes. Eg. nāga-bu, koṭṭa-ṃbu-na, cē-n-i, gōtra-ṃ-na, dēśa-mu, purassara-ṃ. prasāda -$\phi$- cēsiri, accar-vvu, sāsana-vu, pariyāru-vu, karana-mmu-na, etc.

On a study of the above examples, it can be said that '-vu' occurs only in loan words from the 8th cent. onwards. Some words occur with both '-mu' and 'vu'. Eg. pariyāra-mu: pariyāru-vu; prākāra-ṃbu: prākāru-vu; śāsanaṃbu: sāsana-vu. It can also be said that the stem final '-a' is generally changed to '-u' when the suffix '-vu' is added. '-bu' without a preceding nasal is either a scribal mistake or an editorial mistake. '-ṃbu' was the non. masc. sg. suffix which later changed into '-m(u)' by the 7th cent. in loan words and by the 8th cent. in native words. '-ṃbu' or /mbu/ was assimilated into /mmu/ by the 9th cent. '-nu' in words like 'cēnu' and 'kolanu' is not part of the stem. It is an allomorph of '-mu'. The one reason for the statement is that in plural number, forms with and without '-mu' are obtaining as in the case of regular '-mu' forms. The other reason is alternant forms like 'keyam/keyan' and 'kuḷam/kuḷan' are obtaining in Tamil also.

The masculine-feminine (or epicene) plural is formed by adding '-ru' to the stem. The word final '-a' in loans is changed to '-u' in the situation. Eg. (i) in n.w.s: evva-r, vā-ru, vēvu-ru; (ii) in loans: dēva-ra[24], mallu-ra, malinu-r, saṃyuktur-r. The last three forms are typical and also exceptional. In some

24. -r- can be segmented as the plural suffix on a comparison of the two forms 'dēva-ni-ki' and 'dēva-ra-ku'.

